శ్రీమదిన సుభద్రయ్యమ్మగారిచే

రచియింపఁబడిన

# తెలుఁగుకావ్యములు-

---

౧ భాగము-

---

వారి మేనల్లుళ్ళయిన

శ్రీరాజా గోడే నారాయణ

గజపతిరాయనింగారు సి. ఐ. ఇ.

వారివల్ల ఎడిట్ చేయఁబడి

---

శ్రీపరవస్తు శ్రీనివాస భట్టనాథాచార్య

లయ్యవారలుఁగారిచే

విశాఖపట్టణమున

ఆర్యవరముద్రాశాలల

అచ్చువేయింపఁబడి

ప్రకటింపఁబడెను.

1893.



*Printed by G. V. Jagannadhachariar at the Aryavara Press, Vizagapatam. 1893*

# Preface.

At the present time Hindu Girls are taught their own language in schools especially opened for them and ladies in Zananas. Also some generous European Ladies take interest in teaching Fine Arts to them. Yet it is a well known fact that the Antahpuras have furnished, both in ancient and in modern times, women of learning, who were not only Poetesses and experts in Fine Arts, but skilled in gardening also, so as to rear a plant, to facilitate blossoming and fruit-bearing and lay out an Udyanavana (a pleasure garden). This we learn not only from the poetry of Kalidasa &c. but by the Telugu Poets flourished in the Augustan age of Telugu Literature at the time of the great Krishnadevaraya, whose own daughter Mohanangi was the author of a beautiful Poem "Marichiparinayamu". About a hundred years ago Mangalagiri in Kistna District produced a Poetess by name Tarigonda Venkamma who has composed two books called Rajayogasaramu and Venkatachalamahatmyamu. There are other works may be mentioned composed by Telugu Poetesses as Molliramayanamu by Molli.

In looking into my Library, I have come across a Book of Poems written on

Palm leaves composed by an old member of my family. This Lady Sri Madina Subhadrayyamma was the eldest daughter of my grandfather. She was born in 1781 and was the mother of the famous M. Jagga Rao on whom one of the first C. S. Is. was conferred by Her Majesty for his services as a Principal Sudder Amin. He was well known to many European gentlemen of note. Like the mother of Sir William Jones this lady had brought up her son and educated him. She was well known for good works of piety and benevolence. The Poems disclose a deep reverence in Vyshnava religion and in one of her Poems she delineates upon morality. We now publish a selection of her Poems as Part 1.

They may be read with benefit by her sisters in the Telugu Country and perhaps with interest by Europeans who love to read Telugu Poetry.

Vizagapatam.<br>
1st December 1893. } G. N. Gujputee Rao.

# అవతారిక

ప్రకృతమందు హిందూబాలికలకు ప్రత్యేక
ముగా వారలనిమిత్తము స్థాపింపఁబడిన పాఠ
శాలలయందును రాణీవాసపు యువతులకు అం
తఃపురములందును స్వకీయభాష గఱపఁ బడు
చున్నది. ఉదారులగు కొందఱు యూరోపియను
స్త్రీలు వారలకు లలితములగు శిల్పవిద్యలను గూ
డఁ బ్రేమతో నేర్పుచున్నారు. కవితాశక్తియు
లలిత శిల్పకౌశలంబునే కాక ఉద్యాన వనారోప
ణము భూరుహంబులఁ బెంచి పుష్పించుట ఫలిం
పఁజేయుట మున్నగు దోహదక్రియలు మొదలు
గాఁగల వృక్షాయుర్వేద కృత్యములయందు నైపు
ణంబునుగల విదుషులు పూర్వ కాలముననుండి
నేటికిని అంతఃపురములందుఁ గలిగియుండుటయె
ల్లఱకుఁ దెల్లంబే. ఈయంశము కాళిదాసాదికృ
త ప్రబంధములవల్లనే కాక కృష్ణదేవమహారాయ
ల యాంధ్రకావ్యోచ్ఛ్రయ కాలమందుఁ బ్రకా
శించిన యాంధ్రకవుల ప్రబంధములవల్లనుగూడ
మనకుఁ దెలియ వచ్చుచున్నది. ఆరాయలయా
రసపుత్రి మోహనాంగియనునామె మరీచిపరి
ణయమను మనోజ్ఞమైన కావ్యమునురచియించె.

దరిదాపు నూఱు సంవత్సరములక్రిందట కృష్ణాజి
ల్లాయందలి మంగళగిరియనుపురంబునందు త
రిగొండ వెంకమ్మయనుపేరఁ బ్రసిద్ధురాలగునొక
కవయిత్రి రాజయోగసారము వేంకటాచలమా
హాత్మ్యము నను గ్రంథ ద్వయంబు రచియించె.
మొల్లియనునాడుదచే మొల్లరామాయణము రచి
యింపఁబడె. ఈచొప్పుననాంధ్రకవయిత్రులచే
రచియింపఁబడినగ్రంథములువినవచ్చెడు.

మద్గ్రంథసంభారమును పరిశీలించునప్పుడుమ
ద్వంశ జాతయగు శ్రీ మదినె సుభద్రయ్యమ్మచే
రచియింపఁబడిన కావ్యములు లిఖించియున్న తా
ళపత్ర పుస్తకము నాకుఁ గానంబడియెను. ఈ
మె నా పితామహుని జ్యేష్ఠ దుహిత. ఈమె
1781వ సంవత్సరమందు జనించె. ప్రిన్సిపల్ స
దరమీనుగానుండి రాజకీయ కార్య నిర్వాహము
నకుఁగా మునుమున్న సి. ఎస్. ఐ. అను బిరు
దాంకమును శ్రీ శ్రీ శ్రీ మహారాణీగారి వలనఁ
బొందినవారిలో నొకరై ప్రసిద్ధికెక్కిన మదిన
జగ్గారాయలవారికి తల్లి. ఈయన విఖ్యాతులైన
యనేకులగు యూరోపియనుల పరిచయముగలిగి

యుండెను. సర్ విల్లియమ్ జోన్సుగారి తల్లివలె నీమె కుమారునిఁ బెంచి విద్య గఱపెను. ఈశ్వరభక్తిని పరోపకారమును బ్రకాశింపఁజేయు సత్కార్యములచే నీమె ప్రసిద్ధికెక్కెను. ఈమె రచియించిన కావ్యములచే నీమెకు వైష్ణవ మతమందు భక్త్యతిశయము గలిగి యున్నట్లు స్పష్టమగుచున్నది. ఈ ప్రబంధములలో నొకదాని యందు నీతి సవిస్తరముగాఁ జెప్పంబడినది. ఆ కావ్యములలో నుంచి కొన్నింటి నిపుడు ప్రథమ భాగముగఁ బ్రకటించుచున్నాము. ఇది యాంధ్ర దేశ మండలి స్త్రీలకు ఆత్మార్థముగాను ఆంధ్ర కావ్యములు చదువ నభిరుచిగల యూరోపియను లకు వినోదముగాను చదువ నుపయోగించును.

విశాఖపట్టణము.
విజయ సం॥ కార్తీక
బ॥ ౹౩ శుక్రవాసరము.

గోడే నారాయణ
గజపతిరాయఁడు.

# CONTENTS.



## విషయసూచిక.

శ్రీరస్తు

# శ్రీరామదండకము.

# SRI RAMA DANDAKAMU.

శ్రీమైథిలీచిత్త పంకేరుహేందిందిరా- చిత్త భూసుందరా- కోసలక్ష్మా పతీ పాలకా- సూర్యవంశాబ్ధి రాకా నిశా నాయకా- యార్య సత్పోషకా- భక్తనిర్వాణ సంధాయకా- వర్ధితానేక సంసేవకా- దైత్య గోత్రాటవీ పావకా- సత్య సంకల్పకా- నిత్య సంతోషకా- దోష నిర్మూలకా- దూషణోత్సారకా- దుష్టదోత్సారకా- ధర్మ సంస్థాపకా- ఘోరసంసార నిర్మోచకా- సర్వ లోకావళీ వ్యాపకా- సర్వపత్ని శుభ ప్రాపకా- దేవతోద్దీపకా- బాణజారాతి కోదండ విధ్వంసకా- తాపవిక్షేపకా- భూపః క్షేపకా- కుంభికంఠత్రకా- కుంభినీనాయకా- వేదసంచారకా- భేదనిర్భేదకా- మోహవిచ్ఛేదకా- శత్రుభిత్సాయకా- చంచద్రీ కాలకా- మంజు వాగ్జాలకా- కోసలాధీశ సత్పుత్రికాబాలకా- వాలిసంహారకా- వానరాధ్యక్ష చింతాసముత్సారకా- వైష్ణవోద్ధారకా- రామ- ధారాధరశ్యామ- త్వ

ద్దివ్య చారిత్ర పవిత్ర ప్రభావంబు వాగీశ నాగేశ
భూతేశ పూర్వామరుల్ తైనన్ నుతుల్ సేయఁగా తే
రున్నాకుంఠకంబా- ముకుంతాపరాధన్-గదుం
జంచలాక్షన్- శుభాభాగ దూరన్- కృతార్యా
పకారన్- సదాఘోరదోషన్- మహారోష- నై
జన్- భవద్దివ్యలీలల్- సుధాసారముల్- సర్వ
లోకార్తి సంహారముల్- దీన మందారముల్-
నారదవ్యాస సంగీతముల్- లోక విఖ్యాతముల్-
మహాకృత ధ్వాంతమార్తాండ సాహస్రముల్-
కృత్స్నదుష్కర్మసంతాపనామాహాత్మ్యముల్- దేవ
సంస్తుత్యముల్- నిత్యముల్- గాన- నామానసా
జ్ఞంబునం బోచు మార్గంబునం బూని- నా నేర్చు
చందంబుగా- సార సూనస్సు రత్నాలగా- మేలు
గా- దండకం బెంతయుం గూర్చి- త్వత్పాదపద్మం
బులర్పింతు- బ్రహ్మ ప్రసాదంబునన్ గర్వదుర్వా
రదృప్త- రావణాఖ్యుండనన్- కుంభకర్ణుండు- నిం
ద్రారిముఖుల్ సాధులన్ బాధనొందింపుచుండం
గ- నోర్వంగ శక్యంబు గాకున్న- నిర్జరుల్
పద్మజుంగూడి- క్షీరాబ్ధి తీరంబునుం జేరి- యిం
పారంగా సన్నుతుల్ సల్పి- త్వత్పాద రాజీవము
లొంగి- జోహారుగావించి- కీనాశ లోకేశు మ

ర్వర్తనాద్యంతముల్ దెల్ప- సత్యావకీనాజ్ఞ గా-
పించియున్నంతలో- రాక్షసారాతులై శ్రీతులన్
సద్గుణోపేతులై లోకవిఖ్యాతులై బ్రోవఁ
గాఁబూని- నీవా దశస్యందనాఖ్యు పూఁబోఁడిగ
ర్భంబునం బుట్టి- కైకేయి పుత్రుండు సౌమిత్రి
శత్రుఘ్నులుం గొల్వఁగా- బ్రహ్మచర్యాశ్రమం
బొంది- బాల్యోచిత క్రీడ గావింపుచుం సంగ-
గాఢేయుఁ డేతెంచఁగా- రాఘవుండేగి- య
ధ్వానికిన్ మొక్కి- తోడ్తెచ్చి- సింహాసనం బిచ్చి-
సేవించి- పూజించి- నీవేమి గాంక్షింప త్వద్వాం
ఛితార్థంబునర్పింతు నీకన్న- నోదంబు మార్గం
గ- మత్షిన్నతంబాపి మన్నించి- క్రతుః కృతాతంక
ముండిర్చి- నాజన్నముం బన్నగాఁ గావ రక్షిం
ప- నాదిత్యవంశాగ్ర రాకాసుధాధామ నిన్ రా
మునింబంపవే- యంచు బ్రార్థింపఁ- దద్ధారణేవ
ల్లిభుండుల్లముల్ ఝల్లనన్- జిల్లుపాటొంది పెం
పెల్లివారాలుగుం జెల్లుగాఁ దల్లడంబందుచున్
రిచ్చపాటొచ్చఁగా- పై వసిష్టాఖ్యుఁడుం బుద్ధి-
సందేహముల్ ఖేదముల్ మోదమున్ డెంద
మొందే వడిన్ సందడింపంబరంబొందఁగా- హ
స్తముల్ ఫాల భాగంబునం జేర్చుచున్- వీలు

గా గోలనాబాలుఁడాలంబులోఁ బ్రోడగాఁ డె
న్నఁదగ్గాత్రియున్ దిట్టమై దట్టమై యొప్పు-దస్త్రో
పదేశంబులున్ తేవుగా- ఠీవిగా వైరులన్ భం
డనోద్దండులన్ ఘోరులన్ వీకదై తేయులన్ గె
ల్వఁగాఁ జాలునే- ఘోరవీరాసురానీకముల్
గాంచి దాఁ బెగ్గిలున్ డింభకుండయ్యయో- పాయ
ముల్ బాయ నందాఁకనే దయ్యెఁగా సంతసింగం
టి- హా- రాముఁడే జ్యేష్ఠుఁడున్ రాముఁడే కీ
ర్తి విస్తీర్ణుఁడున్- రాముఁడే శౌర్య సంపన్నుఁ
డున్- రాముఁడే వంశ వర్ధిష్ణుఁడున్- రాముఁ
డే దైవమున్- రాముఁడే జీవమున్- రాముఁడే
సర్వ- మీబాలచూడామణిన్ ఘోరదైత్యాళి
కింబంపి యేలీల నే నోర్తు- నా ప్రాణముల్ దేహ
మున్ బాయవే- యుంచు విలాపించి రూపంబు
నిర్జించు నా రాము చంద్రున్ విభాసాంద్రునిం
బంపనే నిల్వఁగాఁ జాల- సంగ్రామ చాతుర్య
లన్ శౌర్య ధైర్యాధికాంచద్యశో ధుర్యులన్ జో
దులన్ బిల్వఁగా నొక్క యక్షౌహిణిం గొంచు
నే వచ్చి- నాయుక్తి చందంబు సంబూని- గూరాసక్తి
గాఢభక్తిగా యాగమున్ సాము రాకంబుగాఁగా
ను. నాసూనుఁ గారుణ్యదృష్టిన్ విలోకించి నాప

బుక్క వెల్లించి రక్షించు - మంచున్ మహాదీనతన్ వేఁ
డు భూనాథునాలాపముల్ వీనులం జొఁడినట్లై
న - గాధేయుఁ డాజ్యాహుతిన్ గొన్న సప్తార్చి
చందంబుగాఁ గోపదీప్తాస్యుఁడై - నీదుసత్యోక్తి
మాధుర్యమున్ గోచరంబయ్యె, నే నేగెదన్, బు
త్త్రీవున్ సుఖంబుండుఁడన్నన్ - భయభ్రాంతుఁ
డై - దేశికుం డెంతయుం దన్నుబోధింపఁగాఁ దే
రి, సందేహముం దీరి, సంతోషము న్మీర - నారా
జునిన్నున్ సుమిత్రాసుతున్ నెయ్యమున్ తియ్య
ముంపారఁగాఁ జేరి - తత్సంయమిం గూర్చి వేఁబం
పఁగా - సార్థమా యోజనం బేగి యచ్చోటనాఁ
బూర్వవృత్తాంతమున్ దెల్పుచున్ - దాటకావృ
త్తముం జెప్పి వేదానిపైకోపుగా నీకుఁగోపం
బుదీపింపఁగాఁ జేసినన్ - చొక్కమాచాపమందె
క్కసంధించి తన్మౌర్వి మ్రోయింపవే - తన్మహా
నిస్వనంబట్ట దిక్కుంభికర్ణాంతరంబుల్ పయో
రాశిగర్భంబు రోదోంతరాళంబు నాపక్రివా
ళాద్రి రంధ్రంబులున్నిండ - నారించి పాదాహ
తిన్ భూమిగంపింపఁ దబ్బిబ్బుగా బొబ్బలం బెట్టు
చున్వచ్చి తాటాయగాఁ బింప్రమాయించవే - తా
టకన్ సూటిగాఁ గూల్చవే - తాపసుం డెంతయున్

సంతసం బందుచున్ దాఁ బ్రయోగోప సంహార
యుక్తంబుగా సర్వ శత్రుఘ్న శస్త్రాస్త్ర సం
ఘాతముల్ దివ్య బాణంబులర్పించఁగా- మౌని
చే నన్నియుం గాంచి- తన్మార్గమం దేగి తత్కౌ-
శికావాసమై యొప్పు సిద్ధాశ్రమస్థానమున్ జొ
చ్చి యున్నంతలో- నెక్కుడౌ మక్కువ న్మౌని
కిన్ మ్రొక్కి- యీయాశ్రమగ్రామణీభక్తరక్షామ
ణీ దీక్షతో నుండవే- దక్షతన్ యజ్ఞవిఘ్నంబు
గావింతు వా రాక్షసాధ్యక్షులం దత్క్షణంబం
దునే శిక్ష బొందింతు నేనంచు మీరానతీయంగ-
గాధేయుఁ డాదిన్నమున్ దీక్షగా మంత్రతం
త్రమ్ములం బూర్ణమై యేర్పడన్ దీర్చుచుండంగ-
నేవరాత్రమున్ నేత్రముల్మూయకుండంగ మీరే
పుఁగానోపికన్ జాపముల్బూనఁగాఁ దాల్చి మూ
డున్ మఱిన్ మూఁడహోరాత్రముల్ గూ
గముగా రాగమొప్పంగ రక్షింప- నేలెంచి దట్టం
బుగా నంతరిక్షంబునందుండి నక్తంచరాధీశ్వ
రుల్ రక్తవర్షంబు వర్షించి యార్వంగ- నీవో
ర్వఁగాలేక- యత్యుగ్ర వాతూల బాణంబునన్
తిలచె నీచుమారీచు వక్షంబునం దేయఁగా- మా
రీ వాఁడంబుధిం గూల- ద్రోహున్ సుబాహు

ద్వాబాహూగ్రాహ వోత్సాహ సంగ్రామ రం
గంబునందుగ్రించవే· తకిర్ యున్నట్టి దైతేయు
లన్ దిక్కుల్ లేకుండఁగా చూర్ణులై వికీర్ణులై
ప్రకటంగాఁ జేయవే· మన్నవన్ జన్నమున్
గావవే- కౌశికుం డెంతయున్ సంతసంబంది-
నీవా విదేహ క్షమాజాని గావించు యాగంబు
నీక్షింప రామన్న మాతోడ రమ్మన్న· హర్షించి
యుంగ్రంకులుంగూడి యేతేరఁ-గాంతారమార్గం
బులో శాపసంతప్తయై రాతిరూపంబుతో నున్న
యగ్గౌతమ ప్రేయసిన్ పాదపద్మోల్లసద్ధూళి
యున్ హాళిచేరుమర్త్యాకృతిధ్వాంతమున్ లోకవిఖ్యా
తిగాఁ బ్రీతిగాఁ బాపిరక్షింపఁ దచ్చాపనిర్ముక్తిచేఁ
బూతయౌ నాతియై నిన్నుఁ బూజింప-నీవంతనమ్మా
నిచే దారిలో సారసద్యాత్రలాలింపుమన్- య
జ్ఞవాటంబు ఖల్ సూటిగాఁ బాటిగా నీటుగా
నేటుగాఁ జేరఁగాఁ బోయి- యచ్చో వసుద్ధా
మమై భండనోద్దండమై యొప్పు నాభీము కో
దండమున్, చండవేదండ మిత్రుపత్రాంకంబు
డాకించమల్ సేయు చందంబునం, దండిగాఁ దిం
డుగా మెండుగా బెండుగా రెండగాఁ దుండి
యల్ సేసి- లోకైక విఖ్యాత చండద్గుణవ్రాత

భృంగాలకోపేత పూతన్ జగన్మాత సీతన్ మహీజా
తను ద్వాహమై- సోదరుల్ పెండ్లి కూతుళ్ళతోఁ
గూడి మా వెంటరా- నేగుచో- భవ్యచారిత్రుఁడై
రేణుకాపుత్రుఁడై యుప్పరాక్షుండు రా- నమ్మ
హాపెరు చాపంబునం దెక్కు- సంధించి బాణంబ
రింబూన్చి తత్పుణ్యలోకంబులన్ లావుచేఁ బో
వఁగా నేసియున్- సర్వగర్వంబు వర్జింపఁగాఁ జే
సియున్- పాయసాదాన్నమున్ నాయకమున్
గల్గు నీదాయలున్ జ్ఞాయలున్ జోదులున్ గొ
ల్వఁగా నేగి- పిన్న య్యయోధ్యా పురావాసివై
సంతతోల్లాసివై యుండఁగా- సంత కామయ్య
గన్నయ్య రామయ్య, మాయయ్య నిన్ గూరి
మిన్ జేరఁగాఁ జేరి- నేదాన ధర్మాములున్ సద్వ్రి
తాచారముల్ చాలఁ గావించి- బల్పేదరాఁ బెన్ని
ధింగన్న చందంబుగాఁ, బ్రేమచే రామ నిక్కంటి-
నీసర్వ సర్వంసహా మండలీ భారము న్నీవు న
ర్పించెదన్, బూనవే పుత్రి- నాసేత్రముల్ చల్ల
గాఁ జూచుచున్ నిర్భరత్వంబుచే సౌఖ్యమున్
జెంది నే ధన్యతన్ జెందఁ, బత్నీ సమేతంబుగా
నేడు పుణ్యోప వాసంబు గావింపు- మెల్లుండి
పుణ్యాహ మోపట్టి నాడే భవత్పట్టమున్ గట్టె

దన్ప్రమట్టుగా నుండవే, పోయిరమ్మంచుఁ బంపం
గ-మంత్రులెల్లరంబొప్పఁగాఁ దత్పురంబెల్లరమ్యం
బుగావింపఁగాఁ జారులంబంపఁగా, వారునాచొ
ప్పుగానొప్పుగాఁ జేయుచున్నంతఁ- గైకేయి
కిన్ దాసియై దాసిగానుండు నామంథరాభిఖ్య
తానొక్క సౌధంబుపైనెక్కి, నిశ్శేషవాద్యాళి
ఘోషంబులన్ వారయోషాది నాట్యాదులం
బెంపుగానొప్పు నయ్యుత్సవంబెల్ల నీక్షించి- పా
దపరిహారంబుచే నైనయీర్ష్యారసంబెచ్చఁగా,
నద్భుగా రామపట్టాభిషేకోత్సవంబంతయున్స
ఘ్నమున్ జేతు నేనంచుఁ దాఁ బూని- కైకేయి
కింబట్టుగాఁ గట్టిదుర్బుద్ధిబోధింపఁ- దత్కాంత
యున్ మంతనంబందునక్కాంతునిం జేరి- యీ
రేడువర్షంబులారాముని న్గానకుంబంచి నాసూ
నునిన్ మానుగా ధాత్రికిన్ రాజుగావించి, మున్నా
టుసీఁబడ్డదైమీయెడన్ మద్వినిక్షిప్తమై యున్న
దా నవ్వరద్వంద్వ మీ చొప్పుగా నొప్పుగావిం
చి, నాకోరికల్ దీర్చవేయంచు, భూనాథునిన్వేఁ
డ- నాజాడ మీకంతయున్ దెల్పఁగాఁ- జాల
హర్షించియున్- సర్వభూపార్హ్య, రాగింద్రివే
షంబులంబూని- మీతాతమాత్రాదులం జేరి స్పే

వింపవే. దాన ధర్మాదులన్ జేగఁ గావింపవే.
తండ్రిసత్యంబు పాలింపఁ, గైకేయి వాక్యంబు
చెల్లింప, సీతాసతీ సోదరుల్ గొల్వఁగా; నాగ
రుల్ రోదన ధ్వానముల్ సేయుచున్ వెంట
రాఁ. దద్రివం బెల్ల నాలింపుచుం బోవ. భూ
జానియున్మానుగాఁ జేరుమీఁకింపఁగా. నొప్పుగా
ముప్పురున్ మవ్వమాన్యందనం బెక్కి, యెంతే
నిఁ బెం పెక్కి, యొక్కింత దూరంబు వేంచేసి,
చొక్కటమౌ వాటమౌ నేటితీరంబునన్ నూ
టిగాడిగ్గి. నిత్యక్రియల్ దీర్చి, పారంబులో నీర
ముల్ గ్రోలి యున్నంత. నెయ్యంబుతోఁ బర్ణ
ముల్ శయ్యగాఁ దీర్చి, సంసుప్తతం బొందున
ట్లుండి. వెన్వెంటనేదంటగావచ్చు తన్నాగరుల్
జాగరూకత్వముజ్జాసి నిద్రింపఁగా, వారలక్ష్మి
యుషాయాంబునన్ బాయఁగాఁ గోరి, ధీమంతుఁ
డౌనాసుమంత్రున్నటాక్షించి-నీవీరథంబింకసాకే
తమార్గంబునం బోవఁగా జేసి, నేర్పొప్పఁగాఁ ద
క్షుమార్గంబునం దెచ్చి యుం దేరు దాటించు శీ
ఘ్రింబుగా నన్న. నయ్యర్ధ రాత్రింబునందాతఁ
డాకృతిఁ గావింప. పాయాహ్న కాలంబునన్
జావ్వవిన్ జేరి. ధీరున్ గుహున్ భూరిపుణ్యా

వహ్నిన్ గాంచి తన్మైత్రి భావించి· యంతన్ సు
మంత్రిన్ మహీకాంతునిం జేరఁగాఁ బంచి-
గంగన్ మహామదవృతవ్రాతభంగన్ దగన్ దా
టనే· త్రోవలో నాథరద్వాజమౌనీంద్రు సేవిం
చి, సత్కారముల్ దీవనల్ చెంది, యమ్మౌని
రాట్పుష్పకన్ జిత్రకూటాద్రియందుంజ· వైదే
హీకాపహాసమున్ జేయు కాకంబుఁ జీకాకు
జెందించి శోకంబునొందింపఁగా, దీనమై నీకు
నకాకి మ్రొక్కం, దదీయాంబకంబంబకచ్ఛిన్న
ముం జేసి రక్షింపవే· యంతమీతండ్రి దాఁబు
త్రిశోకంబుచేఁ గాయమున్ బాయ, నత్కేది
నీసేతమున్ జేర కృత్యంబులం దీర్చి, కైకేయి
పుత్రాదులేతెంచి,తద్రాజ్యతంత్రమ్మిసంతయున్ దెల్పఁ
గా· వారలంగూడి నే లౌకికాచారముల్ ప్రీ
త కార్యంబులున్ దీర్చి యున్నంత· నిన్నంత
యున్ బ్రాజ్యసామ్రాజ్యమున్ బూనవేయం
చు, తద్బాష్పసంప్రీతిమీరంగఁ బ్రార్థింపఁగాఁ-
బాదరెప్పించియున్నాతియుక్తంబులౌ మాట
లన్ మాటిగా వారలంబంచి· నే దండకారణ్య
ముం జేరఁగా· దానవుం డొక్కఁడేతెంచి సీతాం
గనన్ గ్రక్కమందుంచి కృత్స్నక్షితిన్ జేరఁగా న

చ్చి బిట్టార్వఁగా- నోర్వఁగా లేక- కూ్రరాస్త్రి
మున్వింట సంధించి దేవాపరాధున్ విరాధున్
వడిన్ వక్షమున్ గాడఁగా నేయ, వాఁడంత
టన్ బోకధాత్రీసుతన్ డించి యాభీలమౌశూల
మున్వైవఁగా దానిఖండించి బల్దాపు లెదింటిచే
మోపుగాలక్ష్మణుండేయఁగా, నంతమీయిద్దఱన్
మూపునన్ మోపుగాఁదాల్చి- దైత్యాధముండే
గ, నొకక్ష్మాడిన్ నీవు నీతమ్ముఁడున్ వాని దీర్ఘ
మ్ములౌ బాహుదండంబులం దుంచి, వాటంబు
గా ధాత్రికిన్ నేటుగాదాటరే- వాఁడు భూ
మిస్థలిన్ గూలి, యచ్చెరువన్ గల్గు భూమిజ
ముల్ నుగ్గుగాఁబోర్లఁగా, మీరువజ్రప్రహారం
బులంబోలు పెన్ గుద్దులన్ జాలనొప్పింప, దై
తేయుఁ డౌద్ధత్యమున్మాని త్వత్ప్రస్తుతిన్ సిస్తు
మీరంగఁ గావింపుచున్- బూర్వమందేను గంధ
ర్వ రాజేంద్రుఁడన్ గ్రూర కౌబేర శాపంబుచే
నిట్టి రూపంబు బ్రాపించె- నీశాపనిర్ముక్తి మా
తాత నీచేతనేఁబొందితిన్- తేయుజనద్వంద్వ పి
త్రోవలో నేగ మాతీశ్వకుండొకఁడుండుండు-
నచ్చోటికింబోవరే- హెచ్చుగా మేలుమీకిచ్చు
నం- చంతయున్ జెప్పి- నిశ్శాత్మ భావింపుచున్

రోజాచున్ జొచ్చి వైయచ్చరుండై వేఁగన్ జ
న్న-నప్పుణ్యుఁడే చొప్పుగాఁ జెప్పినట్లొప్పుగాఁ
గానలోఁ జోద్యముల్ గాంచుచున్ మ్రానులం గొ
ల్చుచున్ బోవుచున్-గుంభజుం గాంచి సేవించ-
నత్తాపసేంద్రుండు దీవించి మోదించి యాలింగ
నం బారఁ గావించి సన్మానిబృందార్హమౌ విందు
చేఁ బొందుగా దృప్తిఁ బొందించి, దివ్యాసి యక్షీణ
తూణీరముల్ జాపమున్ బాణరాజంబులన్ వె
మ్మితో నెమ్మిగా నిచ్చి, నీవాంఛితార్థంబు నేనిచ్చె
దన్ గోరవే యన్న- మీసత్కృపాలబ్ధి కన్నన్ మ
తేమున్నదిష్టంబు, మాకున్నివాసార్హమౌ గాన
నీవానతీయంగదే యందు మేముందు మన్నన్-
మదం బంది గోదాతటిత్రికిన్ జేరువన్ గౌతమీ
నవ్యప్రాంతంబునన్ మఱ్ఱివృక్షంబు లైదుండు-
నందుండుఁ డన్నంత- నచ్చోటికిన్ బోవుచో మ
ధ్యమార్గంబునన్- భీకరాకారమౌ గద్దనిన్ గ్రి
ద్దనన్ గాంచి- మీతండ్రికే చాలమిత్రుండ, నా
ఖిల శైలాటవీ దూర దేశంబులన్నీరు సంచార
ముల్ సేయఁగాఁ గోరిన న్నీవునన్ మోచి గొం
పోయి మీకిష్టముల్ గల్పి భూపుత్రికిన్గాపుగానుం
డేదన్, దుర్ఘటంబైన కార్యంబు లెంతేనియుం

జేయుదత్తుండ నేనన్న - నీవా ఖగాధీశ్వరున్ జా
లమన్నించి వీడ్కొల్పి - పంచవట్టిన్ముదంబొ
ప్పఁగాఁ గాంచి - త్వత్తోస్వదరుం గాంచి - యోక్త్రు
ణా పర్ణశాలం గడున్ వింతగా నిందు నిర్మించు,
కాంతారమందుండు కాలంబు సర్వంబు నిచ్చో
టవర్తింతమంచున్, నిదేశింప - సౌమిత్రియున్
వాస్తుశాస్త్రోక్తమార్గంబునన్ దంటగా నందమౌ
మందిరంబుల్ వినిర్మింపఁగాఁ దమ్మునిం గౌఁగిటం
జేర్చి - సీతా సమేతంబుగా నెక్కశాలన్నివా
సంబుగా నున్న - సౌమిత్రి వేఱొక్కశాలన్ ది
టంబొప్పఁగా నీకుఁ గైంకర్యమున్ వేఱు కా
ర్యంబులన్నాని జాగ్రత్తన్ సల్పుచుండంగ - నీప
జ్జకున్ నీటుగా నేటుగా గోటుగా గర్వ వాచా
టయౌ నొక్కనైశాటి నిర్లజ్జయై వచ్చి - నీసోయ
గంబెల్లఁ దాఁ గాంచి మోహించి - నీపొందుగాం
క్షించితిన్ నీదువృత్తాంతమాద్యంతమున్ దెల్పి
నన్మన్మనోజాత కేళీ వినోదంబులన్ దేల్పు మ
న్నన్ - దరస్మేరవక్త్రుండవై, యింతినేనద్దశస్యం
దనేశాత్మజుండన్ రఘూత్తంసుఁడన్ రాముఁ
డన్నాప్రాఁడ, నాతమ్ముఁ డాలక్ష్మణుం, డీధరా పు
త్రి యస్మత్కళత్రంబు, నీవెవ్వరే యన్న - నే

నాదశగ్రీవుతోఁబుట్టువున్ చుప్పనాతిన్ ననున్
గూడవే, వియ్యమంచున్ ఖరుం డెంతయున్నన్న
నల్ సేయు- తద్భాగ్య మూలంబు నన్నెన్న
గామించితిన్, రామ తత్ప్రియసిన్ బాసి బల్
నెయ్యముం దియ్యమున్ దోఁప నన్ గూడి నీవుం
డు, మీ చేడె నీకీడుగాదింతటన్ వీడుమా, నేను
నీకున్నదమున్ మంచి యీడైన జోడౌదు, నీదార
యాకారమున్ నీకునన్నీరునా గోరునం గేరునే,
యిద్దురాచార దుర్గత్ముణోపేత యా మైథిలిన్
మ్రింగి నీయిచ్చకున్వచ్చు నట్లచ్చగా గచ్చగా
హెచ్చగా బంధభేదంబుల న్మన్మథ క్రీడలం దే
ల్చి చొక్కింతుఁగా, నైపుణిం జూపనిచ్చోటఁజో
టెమియున్ లేదు, నీతమ్మునిందుంతునే యన్న-
హాసంబు భాసిల్ల, నత్యంత మీయింతి కేఁగూర్చె
దన్, నీవు నన్బొందినన్ సౌఖ్యముం జెందఁగా లే
వు, నాపొందు సౌకెందు, కాసుందరాకారునిన్ ధీరు
సౌమిత్రినింపొందఁగాఁ బొందవే మైత్రిచే న్నొంద
వానందమొందించు నిన్నందు బొద్భ్రాంతున న్మించి
నన్-సిగ్గుతోఁ జగ్గుగాఁ జేరఁగా వచ్చి-యాలత్కుణా
నీవు నాథగ్గవై కామసంతాపసంహార్త్రవై బ్రోవ
వేయన్న-యాసుందరి మోసముం జెందె త్వద్భ్ర

లన్ వాని ధాత్రీస్థలిం గూల్చి- సీతాసతీలక్ష్మ
ణుల్గొల్వఁగా నెమ్మితోనుండఁగాఁ- బఙ్క్తికంఠుం
డు నిండోలగంబున్నచో- నకంపనుం డొకండే
తెంచి దండప్రణామంబుఁ గావించి- యో దేవరా
దండకారణ్యసీమన్, బ్రచండోగ్ర తూణీరధా
రుల్ మహోదారశూరుల్ మహామేరుధీరుల్
జటాధారులౌ రాకుమారుల్, వరారోహ యా
నొక్క నీరేజపత్రాక్షితోడన్, నిరాఘాట ధా
టిన్ బ్రవేశించి, యందివ్వఁ గ్రీడించు నీ చెల్లె
లిన్ ఘ్రాణకర్ణంబులం జెక్కి, పేరుక్కునన్
బెక్కువేల్ రక్కసుల్ గొల్వ త్వత్సోదరుం
డౌ ఖరుం దాజికిం బిల్వ- నవ్వీరులం దొక్కఁ డీఁడ
కక్కుం డొంటిఁ జెండాడి, రిన్నేల నిన్నేని వారో
ర్వఁగాఁ జాలి యున్నారు, త్వత్సన్నిధిన్ వి
న్నవింపంగ భీతావహంబౌ, నటంచున్ మఱిన్
గొన్ని దుర్వ్యథలం దీర్చినన్- గ్రోధ తామ్రా
స్యుఁడై, కొంత సే పెంతయుం జింతతో ఖేదమో
దంబులం జెంది- తానొక్కఁడున్ సింధుతీరంబు
నన్ దాటకాపుత్రునిం జేరఁగాఁ బోయి, మా
రీచుచేఁ బూజితుండై, దురంతార్తిచేఁ దూలు
చున్, విన్నవృత్తాంత మాద్యంతమున్ జెప్పి- నీ

నేర్పు దీపింపఁగా జానఁగా జానకిం గూర్పవే
యన్న- వాఁడెంతయున్ వంతచే మంతనంబుం
దు నాచింత దప్పింప, నిశ్శంకగా లఁకకు న్వచ్చి
యున్నంతఁ- దన్నెంతయు న్నిందగాఁ జింపుచుం
రక్తసిక్తాంగియై భిన్ననాసాశ్రుతుల్ చూపి- నీ
కీర్తిరూపంబు గాఁ గారణంబేమి, యీదుష్క్రి
యం జేయఁగాఁ జేతు లెట్లాడెనే, యాతఁడె
వ్వాఁడు, పుల్కిసలుయ్యాల లూగంగ మాహిం
చె, వాఁడెంతవాఁడైన నేనంతకుం జేరఁ బంపిం
తు, నాద్యంతమున్ దెల్పవే యన్న- కాపట్య
మేపార, నోయన్న- యాదిత్యవంశాబ్ధిసోముండు
రాముండు వైదేహియన్ భార్యయుం లక్ష్మ
ణాభిఖ్యుఁడౌ తమ్ముఁడు న్వెంటరాఁ, దండ్రి వా
క్యంబునన్ దండకారణ్య సంచారులై యుండఁ
గాఁజూచి- యీమూఁడులోకంబులందున్న కాం
తాళిలో రూపరేఖా విలాసంబులం మిన్నదై
యున్నయవ్వెన్నెలాడిన్ నినుంగూర్ప నేఁగోరి
కం వారి కన్ప్రేమి తోడ్తేరఁగాఁ- దమ్ముఁడిం బం
పి నన్నిట్లు గావించె. నీ వైభవం బెల్ల సాఫల్య
ముం బొంద నవ్వారిఁ గందెచ్చి కేళీగతిం గూడ లే
కున్న గవ్వైదర్య దోర్వీర్యముల్ నిష్ఫలంబుల్,

త్పదీమోక సౌభాగ్యముల్ వృద్ధి, మం చెంత
యున్ మాటలన్ గామమున్ బ్రేమయుల్ మ
త్సరం బెన్నఁగాఁజేయఁ నద్దాన వెంబ్రుండు
దాఁగ్రమ్మరన్ప్వ- మారీచుఁబేర్మిన్ విలోకించి,
యూత్మాభిలాషం బెఱింగించి ప్రార్థించి- మున్
రామ బాణాహతిన్ నెచ్చియున్నట్టి నేనెట్లు
దేనేర్తు, నయ్యాదినారాయణుండిట్లు మర్త్యాకృ
తిన్ రాముఁడై పుట్టె, నాఁ యూదిలక్ష్మీ స్వరూపం
బె సీతామహాదేవియా, నీజగన్మాత నాభూతధా
త్రితనూజాత నోతాత నీభ్యాళి దూల గ నీకీతిఁ
గాంక్షింపఁగా నీతి గాదంచు నేలీల మల్లించి
నన్ బోక దిక్కుంభయున్ జేయ- నాతండు మా
యూకురంగాకృతిన్ బూని, బంగారపున్ మేని
రంగుల్ విడంబింపఁగాఁ, బూతయా సీతకున్
దృష్టిమార్గంబులోఁ జూపటుల్ దంగ గాఁ వంగు
చున్ పొంగుచున్ చంగునం దాటుచున్ నిల్వ-
వైదేహి యద్దాని సౌందర్యమున్ భ్రాంతితో జూ
చి, యుత్మత్పదాంభోజమున్ గాంచి సేవించి,
యోరాజకందర్ప నాకోరుకల్ దీర్చు మీ లేడినే
జాడనైనన్ దయం దెచ్చి యిమ్మంచు వేఁడన్, ధ
నుర్బాణముల్ దాల్చి, యచ్చోట దేశం దమ్ముని

రక్షకై యచ్చట నిల్పి, యా లేడి నేజాడ
లన్ గూడఁగా లేక, బల్యాడికోలన్ బడన్ వే
య- హాసీత హాలక్ష్మణా యంచు నీపలుకుఁ గాఁ బ
లుకుచున్, పాతకం బెల్ల దూలంగ మారీచుఁడా
నేలపైఁ గూల- నీదార ఘోరారవమాలించి తా
జాలిచే సోలి సౌమిత్రితో, మైథిలీనో యన్న పో
యన్న నిశ్చిత్తై, నేయాపదల్సెందనో, వేగ నీ
వేగి దోడ్తేఁగదే యంచుఁ బ్రార్థింపఁగా- నమ్మవే
యమ్మ- యగణ్యాపదుద్ధారకున్ బొందవే యా
పదల్, భ్రాంతవై తింతెపో- యన్న- నాయం
గనాకర్ణకున్ దైవయోగంబుచే నిష్ఠురాలాప
శూలంబులన్ జాలనొప్పింపఁగా- లక్ష్మణుండో
ర్వలేకేగినన్- దక్షిణంబందు సద్విప్రవేషంబు
తోఁ గాలకంబోధికుండై దశగ్రీవుఁడేతెంచి, నా
రాయణా యంచుఁ దత్పర్ణశాలా బహిర్ద్వార
ముం జేర- భూజాత యింపూనఁగా నర్ఘ్య
పాద్యాదులన్ శత్యపుష్పాదిగా నెంచి యర్పింప
సంతోషితస్వాంతుఁడై యుండి, యద్దోషి దానా
త్మగామానలం బేర్చఁగా నోర్వఁగా లేక, రాకేం
దుబింబాస్య నీవృత్త మాద్యంతముం జెప్పవే య
న్న- నేనెన్న వైదేహపుత్రిన్ దశస్యందనాధీశు

కోదండదీక్షాగురుండన్ - రామభద్రుండు మద్భర్త,
కైకేయి వాక్యానుసారంబుగా రాజ్యభారంబు
వర్జించి, తత్సోదరుండైన మా లక్ష్మణున్ నన్ను
దోడ్కొంచు కాకుత్థ్సుఁడేతెంచి, యీకాన
నిందుండి వారిద్దఱున్ వేఁటకై యేగి, రాకింక
తత్కాలంబులో వత్తు రందాఁక నిందుండి తత్పూ
జలం దృష్టినొందంగ మీరర్థులన్నంత- దుర్మోహి
నై నిర్జరద్రోహి రేయింకొన్ని యామాన వాధీ
శుతోడన్ దరిద్రంబులం బొందు నీ కేటికే, న
న్ను గామించినన్ భాగ్య సంపన్నఁగాఁ జేతు
నన్నంతలో- వీనులన్ హస్తముల్ చేర్చి· దూ
రీ దురాత్మా నినున్ గూటసన్యాసివేషున్ మదీ
యాధినాధుం డిదేవచ్చి తీక్ష్ణేషుపాతంబుచేఁ
దుంచుఁ గామించెదన్ భాగ్య సంపన్నవై యే
ననన్- చాన నన్ హీనుఁగా నెంచి యిట్లంటివే,
పఙ్క్తికంఠుండ రక్షోధినాధుం డహంచున్ నిజా
కారమున్ జూపినన్- వేపమానాంగియై మూర్ఛ
తో భూమిపై వ్రాలఁగాఁ- బాపినై లోకకం
టాపినై పొందుగా జానకిన్ పెందొడన్ జేర్చి
యూహారసారంబుగాఁ దేరుపైనెక్కి పొంపె
క్కి వేడిన్నునన్ జెన్నుగాఁ బన్నుగా సన్న

గాఁ బోవుచుండన్ - జగన్మాతయా సీతయున్,
శోకసంతప్తయై - నేపిదేవాత్మజాతన్, దశస్యం
దనాఖ్యానసీజానికిన్ గోడలన్, రాఘవేంద్రుం
డు మద్భర్త, యోమర్త్య లోకేశులారా యమ
ర్త్యేశులారా ననన్ బ్రోవరే యంచు నెల్గెత్తి
శోకింపఁగా - నాజటాయుండు నాలించి పాలిం
చ నేతెంచి. తీవ్ర ప్రతాపంబు దీపింపఁ - గో
పంబు తాపంబెదన్ గ్రమ్మఁగా యమ్మగా తీవిగా
రావణుం దాకి - పాదంబులన్ దన్నుచున్ గోరు
లన్ జీరుచున్ ముక్కునం జెక్కుచున్, పక్షవి
క్షేప వాతాహతిన్ దూలఁగాఁ దోలుచున్,
బోరు ఘోరంబుగాఁ జేయ - దోషాచరేంద్రుం
డురోషంబుతోఁ దీక్ష్ణ కౌక్షేయమున్ బక్షముల్
ద్రుంగఁగా నేయ - నావేత్రుటునన్ గ్రక్కునన్
వ్రక్కలై, ముక్కునన్నోతఁ బెన్నెత్తురుల్ గ్రి
క్కుచున్, బ్రాణమాత్రావశిష్టంబుగా ధాత్రి
పైఁ బక్షినాథుండు గూలన్ - ఘనస్యందనం బెక్కి
సీతాసతిం గొంచు నాకాశ మార్గంబునం బోవ -
నా త్రోవలో బుశ్యమూకాద్రిశృంగంబునం దేవు
రిం గ్రీడ గావించు కీశేశులం గాంచి, వైదేహి పైఁ
బుట్టకున్ ముట్టుగాఁ జించి నెమ్మేని భూషావ

లిన్ గట్టిగాఁ గట్టి శాఖామృగాధీశ మధ్యంబున
న్నైవ - వేవేగ నక్తంచరాధీశుఁ డా లంకకున్
జాగి - తత్పట్టణాంతఃపురాశోక వన్యంతరాత్యం
త రమ్యస్థలిన్ డించి - భూజాతకున్ రక్షగాఁ బెం
పఁ దైత్యాంగనారాజి నుండన్ నియోగించి - య
త్యంత చింతా పరీతాంతరంగంబు తోడన్ వి
హారంబునం జేరి - యయ్యుక్కువుం డక్కురం
గాక్షిచే ధిక్కృతుల్ గాంచుచున్ బోకుఁ
చండంగ - నీవంతటన్ దమ్మివిం గాంచి - వాలక్ష్మ
ణా బుద్ధిమంతుండవై యుండి కాంతన్ వనా
న్తంబునం దొంటిగా నుంచి రా వచ్చినా య
న్న - యన్నా ప్రపన్నావనా సన్నవన్నార్తి నోఁచి
ల్చు నీ వాక్యమున్ బోలె శబ్దంబు పీతేర, నత్త
న్వి శోకాతురాలై యున్న - నేనెమ్మి దీపింపఁగా,
నమ్మ మాయన్న వాక్యంబుగా మాఁగటన్ జెందు
మన్నన్ - భవత్సన్నిధిం దెల్పఁగా రాని దుర్వా
క్యముల్ బల్కఁగా, వీనులన్ సోఁకఁగా, నిల్వఁ
గా లేక, నేవచ్చినానంచు, నా రాకతప్పంచుఁ -
దానెంతయున్ జింతతో విన్నవించంగ - స్త్రీవా
క్యముల్ నిక్కముల్ గా మదిన్నమ్మి రాఁగూడ
నా యంచుఁ, దావిన్నవై కన్నులన్ బాష్పము

ట్రిష్ఠఁగా, దైన మిక్కిలి సీతావియోగార్తి పా
ల్పైసె నన్నుంచు, నీవిట్లురా నొంటినెట్లున్నదో
యంచు, నుల్లంబులోఁ దల్లడం బందుచున్, బె
కుఁ సందేహముల్ దోఁచినన్ మల్లడిం బొం
దుచున్ మెల్లనే వచ్చి- తత్పూర్ణశాలాంతరంబం
తయున్ వంతతోఁ గాంచి- వైదేహి లేకున్న- న
శ్రానలో నెల్లెడన్ రోసి- బల్వేసటం జెంది-
ధాత్రీసుతన్ గానఁగా లేక- నయ్యంగనా రత్న
మాసక్తిగాఁ బెంచఁ బెంపొంది యున్నట్టి సా
రంగపోతంబు శ్రేతెంచు మార్గంబులోఁ గొం
తదవ్వేగి- తానందు దివ్యంబులౌ పుష్పమా
ల్యంబులం దారహారంబులం దెల్పి కీర్ణంబులై
యుండ నాడాడ నాజాడ నీక్షించి శోకాబ్ధిలో
మున్గుచున్- దానవుం డెవ్వఁడో యింతినీతో్ర
వఁ జౌర్యంబుగాఁ గొంచుఁ బోఁబోలు, నిం
కేటికీ పౌరుషం బంచు, భూమీస్థలిన్ వ్రాలి మూ
ర్ఛిల్లి, సౌమిత్రి బోధింప నమ్మూర్ఛ దేల్పొంది-
శూరాత్ముఁడౌ రాక్షసుం డింకెఁ గొంపోవఁగా
భానుడున్ బంచ భూతంబులున్ నిర్దయన్
బాపచేతస్కులై యూరకే చూచుచున్నట్టి యు
శ్రీవరం బంతయున్ బాయఁగా వీరలందుఁ గ్రిం

చితేఁగాని కోపానలం బారునే యంచు, సత్యు
గ్రతన్ భూస్థలం బెల్ల బీటల్ వడన్, శైల వర్గం
బు లల్లల్లనాడన్, దిశల్ గంపముం జెందఁ, జు
క్కల్ ధరన్రాల, నబ్జానుసప్తాశ్వ ముద్భ్రా
న్తమైపోల, దిక్పాలకుల్ భీతులై యుండఁగా,
ఖండనోద్దండమౌ చండకోదండ మౌర్వీనినా
దంబు రోదోంతరం బెల్ల నిండన్ వడిన్ జేసి-
బ్రహ్మాస్త్రమున్ వింటసంధింపనూహింప- రౌ
ద్రీకృతంబొల్చు నీమూర్తి నీక్షించి, సౌమిత్రి
మైత్రిన్- బ్రశాంతుండ వయ్యున్ గృపాస్ఫూ
ర్తిఁ జాలించి యీలీల నీవిజగత్క్షోభమున్ జే
యరా, దద్దురాచారు చోరున్ బరీక్షించి తత్స
త్రిమిత్రాది వర్గంబు తోడన్ బదభ్రష్టుఁ గా
వించి ధాత్రీసుతన్ దోడితేవచ్చు, లోకంబులం
గావవే- యంచు బ్రార్థించఁగాఁ- గోపమున్
దాపమున్ బాసి, తచ్చాపమున్ డించి- యో
లక్ష్మణా మీదటన్ జేయు కార్యంబు నాకంత
యున్ జెప్పవే, యంచు మీ రానతీయన్- వి
భో సత్యసంధుండవౌ నీకు మేలే యగున్- సం
దియంబేటి, నీజాడనే జోడుగా నేగ నచ్చెడియం
జూడనా, సర్వమున్ సాధ్యమౌ నన్న- నాచో

ష్ఫునం దొప్పఁగాఁ గొంతదవ్వేగి- యచ్చో మ
హోన్నతుం గైలాకృతిన్ బక్షముల్ మ్రింగి ధా
త్రీస్థలింగూలి సట్టూర్ధ్వగన్ దోఁపఁగా మూల్గు
చున్నట్టి పక్షీంద్రునిం గాంచి- కన్గొంటివే లక్ష్మ
ణా, జానకిన్ మ్రింగి యీ యద్రి గాకారముం
దాల్చి యున్నాఁడు మాధాత్మకుస్వీని సంహా
రముం జేతు నేనంచుఁ- గ్రూరాస్త్రముల్ వ్రే
యఁ బూనంగఁ- బక్షీంద్రుఁ డామాట లాలిం
చి, యావత్స్వవృత్తాంతముం దెల్పి, దే
హంబు చాలింపఁగాఁ- జాలదుఃఖించి- మీతం
డ్రికిం జేయు చందంబుగా, నాతనిస్వామి కం
దగ్ని సంస్కారమున్, గౌతమీ గంగ చేఁదర్ప
ణాది క్రియాకాండమున్ దీర్చి- యంతన్ జన
స్థానమున్ దాఁటి యొక్కింతదూరంబు మీరే
గ- నందొక్క వైశాఖి మేతెంచి, సౌమిత్రి వీ
క్షించి, హోనంబు భాషిల్లఁగా సంగమాపేక్ష చే
డాయ- నాసువ్రతుం డాదురాచార నాసా
స్తన శ్రోత్రముల్ గోసి మోసంబు నొందిం
చ- మీరచ్చట న్నిల్వకం జాగి- పేఙ్గొక్క చోఁ
గ్రూరకమాగానుబంధుం గబంధున్ మదాంధున్
భవ ధృతు నేచ్ఛా వరుంధున్ సమాకర్ణణో

వ్యక్త దోర్బంధు నేర్పాటుగాఁ జూచి- తద్దీర్ఘ
బాహు ద్వయిన్ దమ్ముఁడు న్నీవునుం జకిరి-
యొక్కరొంత శంకించి- ఖడ్గంబులంకించి తద్బా
హువుల్ ద్రుంచ- వాఁడక్షతంబాసి విజ్ఞానియై
వేఁడి, సౌమిత్రిచే నీదు వృత్తాంత మాలించి,
తాశాపముం బొందు చందంబు విన్పించి- మే
న్వేడెదఁ దానిమీ రగ్నిసంస్కారముఁ జేయ
నేతొంటి దేహంబుతో నిల్చి మేల్గూర్తు నన్నంత-
నట్లొప్పగాఁ జేసి- యద్దానవాదిష్ట మార్గం
బునన్, రాఘవుని ముక్తసూర్యేందులోనా,మ
తంగాశ్రమ స్థానమున్ జేరి- యందమ్ము నిం
దాశ్లిష్ట నన్మట్టి యమ్మ ద్ర్యమాలోకనేచ్ఛాను
షంగన్ శబర్యంగన న్గాంచి- సద్భక్తిచే నామె
గావించు పూజా విధానంబులం దృప్తులై- చం
పకాశోక పున్నాగ ముఖ్యావనీజాత జాతంబుచే
నింపు సొంపారు పంపా నదీ తీరముం జేరి- ర
మ్య ప్రదేశంబులో స్నాన సంధ్యాదులం దీర్చి
యున్నంతటన్- వాయుపుత్రున్ గృపాపాత్రు
నింగాంచి- యాతండు సుగ్రీవుతో సంధిగావిం
చ- న య్యుగ్రదీధి త్యపత్యంబును న్నాళి నన్యో
న్యవాక్యోపవాక్యంబులన్ ధైర్యమున్ జెంది-

హస్తంబు హస్తంబునం బట్టి- గూరింగనాద్యా
దులన్ సత్కృతుల్ సల్పి- యగ్నిం బ్రదక్షిణించి
తత్సాక్షిగా ముఖ్యమౌ సఖ్యమున్ జేయ- సు
గ్రీవుఁ డవ్యగ్రభావంబుతో నుత్తరీయార్ధ
ఖండంబునం గట్టి యున్నట్టి భూషావళిం గట్టి
గాఁ దెచ్చి మీకియ్యఁగా- నుల్లమున్ ఝల్లనన్
బెల్లుగా బాష్పముల్ రాల మూర్ఛిల్లి- సుగ్రీ
వు నమోఘోక్తులన్ మెల్లనే దేరి, శోకంబు వో
కార్చి- ధీరత్వమే పార, దుర్గర్వ శీలిన్ యశ
శ్శాలి వాలిన్ గృపావాల నీవొక్క వాలమ్ముచే
నేలపైఁ గూలఁగా నేసి- కిష్కింధ కప్పద్మ మి
త్రాత్మజున్ రాజుఁగావించి- సుగ్రీవ నీవిచ్చటన్
దారయున్ దారయున్ గొల్వ సౌఖ్యంబులం
జెందుమా- యంచు మన్నించి, కారుణ్యదృష్టి
న్విలోకించి- నేనిగ్గిరిం గానలో వానకాలంబు
వోఁ బుచ్చెదన్- రాజ్యమున్ బూజ్యమై యొప్ప
నీ వేలు- మంతన్ శరత్కాల మేతేర, నీ సేన
లన్ గూడి రమ్మంచు- మీ రానతియ్యంగ- నారీ
లగా నేగి, యానాటికిన్ రాక, స్త్రీకూట సౌ
ఖ్యంబునం జొక్కి, యక్కాట మిందకిం గాయు
న్నన్- మహీజా వియోగాగ్నిచే ఖిన్నతన్ వి

న్నమై యున్న నీవంతఁ గోపంబు దీపింప సౌమి
త్రిచే మిత్రజుం బిల్వనంపింప- నీయాజ్ఞచే నా
తఁడుఁగ భీత చేతస్కుఁడై, యొకఁ డర్కజాది
నన్ తెఱఁగొనన్ మిక్కుటై యుక్కుఁనం జొఱఁ
వా మర్కటాధీశ సైన్యంబులం గూడి, యుష్మ
త్పదాంభోజముల్ గాంచి సేవించినన్, జాల
హర్షించుచున్- భూసుతాన్వేషణార్థంబున
వ్వానరాధీశులం బంపుచో- భీతశత్రుఁ బ్రభా
విస్ఫురద్గాత్రుఁ గారుణ్య పాత్రున్ సుర స్తుత్య
చారిత్రుఁ గీశేశ సన్మిత్రు నవ్వాయుపుత్రున్ బ
విత్రుం గటాక్షించి- యేలీల నేనిన్ మహాత్ములు
గా వీలుగా నీవు ధాత్రీసుతన్ గాంచి- కాకు
త్థ్స సంతానమున్, నాదు ప్రాణంబు, రక్షిం
పవే యంచు- రత్నాంగుళీయంబు వైదేహి కి
వ్వంచు మోహంపు వారాసి యుప్పొంగ నీ వి
య్య- నయ్యుంగరంబున్ గరంబున్ బ్రమోదం
బుతో నుత్తమాంగంబునం దాల్చి- నిన్నాత్మ
లో నిల్పి సేవించి కీర్తింపుచున్- గోష్పదం బ
ట్లు వారాసి లంఘించి- నిశ్శంకలంకా మనోగర్వ
మున్ సర్వమున్ బాపి- యాలంకలోఁ జొచ్చి-
యారామ సీమన్ గృశీభూత శీతాంశులోపేత

మాలిన్యయుగ్వస్త్రసంవీత నక్తంచరీభీత సీతన్
జగత్పావితదర్శించి-యోయిమాత త్వద్భర్తయా రామ
భూనేతకున్ దూతనైఖ్యాతిగానుంటి నెమ్మిన్,
హనూమాఖ్యధానుండ నమ్మా దయం జూడవే
యంచు నమ్మించి- యో దుష్టసంహారకా, నీవా
ర్తలన్ దెల్పి- సద్భక్తితో నుంగరం బానవాలి
చ్చి, యయ్యంగనా రత్నమున్ జాలనూరార్చి
మోదావహున్ జేయ- వైదేహి, యో యంజ
నాజాత నీవీ యభిజ్ఞానమున్ గొంచు వైదేహ
జామాత కిమ్మంచుఁ జూడామణిన్ రక్తితో నీ
య- నాసక్తితో నంది- తానప్డు దారావణా
రామముం దామసం బొప్పఁగా, నామహా
త్రివశేషంబుగాఁ జేయ నూహించి- వృక్షం
బులంగూల్చి, ప్రాఁదీగెలం ద్రుంచి, తత్పాలక
వ్రాతమున్ద్రుంచి, ప్రాసాదముల్ సౌధముల్
మంటపంబుల్ బడం ద్రోచి, తత్తోరణ స్తంభ
మందక్షఁగాఁ- బఙ్క్తికంఠాజ్ఞచేఁ బంచసేనా
గ్రగుల్ మంత్రిసూనుల్ దనుం దీక్ష్ణశస్త్రాస్త్ర
ముల్ గప్పుచుం దాఁకినన్- వారి నెల్లన్ నిరా
యాసవృత్తి న్విదారించి- యక్షున్ జయాపే
క్షు నక్షీణదోశ్శక్తిచే దక్షిణాధీశు వీక్షించఁ

గాఁబంచి- దేవేంద్ర జిష్ణుక్తమైవచ్చు బ్రహ్మాస్త్ర
బద్ధుండవునుంబోలెఁ దద్బంధమున్ జెంది- లో
కైక విద్రావణున్ రావణున్ గాంచి- న్యాయ
ప్రకారంబుగాఁ గొంత శిక్షించి- లంకాపురంబె
ల్ల నిశ్శంకగాఁ గాల్చి- వాలాగ్ని సంభోధిలో
నార్చి- భూపుత్రికిన్ మైత్రితో మ్రొక్కి- స
ర్వామరుల్ సన్నుతుల్ సేయ- నాకాశ మా
ర్గంబునన్ వాయువేగంబుగా జాంబవన్ముఖ్యు
లంకూడి- స్వేచ్ఛాగతిన్ వచ్చి- యవ్వాయు
సూనుండు త్వత్సన్నిధిం జేరి, జోహారుగావించి-
వీక్షించితిన్ సీత సంచచ్ఛుభోపేత లోకైకమా
తన్ భవద్దర్శనేచ్ఛా సమన్వితనై లంకలోనుం
డఁగా- న మ్మహీజాత సీమంబుతోఁ బ్రేమతో
రామ నీమోహనాకారమున్ భావమందుంచి,
త్వద్ధ్యానకై ప్రాణముల్ నిల్పి, శ్రీరామ రా
మా యటం చెప్పుడున్ దేవ మీరాక గాంక్షింపు
చున్, ఖిన్నయై కన్నులన్ బాష్పముల్ మేను
లోఁ గార్శ్యమున్ జెకుర సంగేలు నైవెన్న్యము
లో దైన్యమున్ బాయకుండంగ, నక్తంచర స్త్రీ
ల మధ్యంబునన్ రోదనంబెప్పుడున్ మాన కా
హార నిద్రాదికం బేమియున్ లేక భూశయ్యపై

నుండి- రెండే నెలల్ నిండు నందాఁక నేజీ
వముల్ నిల్పెదన్- రాఘవుండంత రాకుండిన
న్నిల్పలేనంచు- వేగంబుగా రావణుం ద్రుంచు
యత్నంబుతో మిమ్ము నచ్చోటికిం దోడితెమ్మం
చు వాక్రుచ్చి- నా మ్రొక్కుగా మ్రొక్కవే
యంచు, నన్నంపుచో నానవా లిచ్చెనంచున్-
బ్రణామంబు గావించి, పై కొంగులో యత్న
పూర్వంబుగాఁ గట్టి యున్నట్టి యద్దివ్యరత్నం
బు నీ కీయఁగా, మన్ననన్ గన్నులం జేర్చి-
యా నిస్తులంబైన సద్వస్త్ర చూడామణిన్ మ
స్త్రమం దక్కునన్ జెక్కునన్ మక్కువన్ దాఁ
పుచో మిక్కిలిన్ దుఃఖమున్ జెంది- కీశేశుఁ
డుం దమ్ముఁడున్ నెమ్మి మారార్పఁగా శోక
మున్ వీడి- యో తమ్ముఁడా నేను నాతమ్ముఁడు న్నీ
ప్రభావంబుచేఁ గ్రిమ్మరన్ నెమ్మితో నుండఁగాఁ
గల్గె- నాదిత్యవంశంబు రక్షించితీవంచు- నేదీ
నికి న్సారుగా నేమియున్ జేయఁగా నేర నీకున్-
బరీరంభణం బిచ్చెదన్ జేర రమ్మంచు-న వ్వా
యుజుం గౌఁగిటం జేర్చి మన్నించవే- భానుసూ
ను న్విలోకించి, నామానసం బెంతయున్ సంత
సంబందె- నాకాశమధ్యంబునం జెంది యు

గ్రాంశుఁ డున్నాఁడు- నే డీముహూర్తంబు
లో జైత్రయాత్రన్ బ్రవర్తిల్లినన్ వైరులం గె
ల్తు మంచున్- బయోరాశి తీరంబులో సేనల
న్నిల్పఁ బంపించుమా యంచు- సద్గంధవాహాత్మ
జున్ వాలిజు న్నీవు నీతమ్ముఁడున్ లీలఁ, దా
ర్క్ష్యోక్షరా డ్వాహులా కేశవేశానులం బో
లి, పెంపెక్కఁగా నెక్కి- సుగ్రీవనీలాది స
ర్వప్లవంగోత్తముల్ జాంబవన్ముఖ్య భల్లూకలో
కేశ్వరుల్ గొల్వ, దైత్యేశ్వరున్ గెల్వ, దండె
త్తి. మీరప్పయోరాశి తీరంబునన్ డిగ్గి యుం
దుండఁగాఁ- జూచి, దేవారిచారుల్ మన స్తుల్య
కంపారులై యేగి, తద్వార్త మండోదరీ భర్త
కుం దెల్పఁగా- హైన్యదైన్యంబులం జెంది- దైవం
బదెట్లుండు నట్లయ్యెడిన్, దానిఁ దప్పింప శక్యం
బు గా దంచు, ధైర్యంబు చేయూఁతగా వచ్చి-
యాస్థానపీఠంబునన్ నిండుగొల్వుండి- ధీమంతు
లైనట్టిసామంతులన్ న్యాయ తంత్రజ్ఞులైనట్టి స
న్మంత్రులన్ గాంచి- యీ నాటి కిప్పాటికిం జే
టు వాటిల్లు నంచున్ గడున్ భీతి నానెమ్మదింబు
ల్కె- నీవింతల న్వింటిరే- స్వల్ప కాలంబులో మ
ర్కటుం డొక్కఁడే లెంచి, క్రీడావనిం బాడు

గావించి, యుద్ధ క్రియాదక్షు నక్షున్ జయా
పేక్షుఁడై యక్షతుండై యనింగూల్చి- వాతో
వివాదించి, మత్పట్టణం బంతయున్ గాల్చి- సీతా
సతిం జూచి భాషించి, యంభోనిధిం దాఁటి, ని
ర్భీతుఁడై లోకవిఖ్యాతుఁడై పోయె- ధాత్రీజకై
మానవుల్ రాఘవుల్ భూరి శాఖామృగశ్రే
ప్రపిరోగ్ర సైన్యంబు లేకాగ్ర చిత్తంబులం దమ్ము
సేవింప, సుగ్రీవుతో నబ్ధి తీరంబునన్ డిగ్గి యు
న్నారు- వారాశి నేలీల నైనన్ వడిన్ దాఁటి వ
చ్చేగ:- వారిందు రాకుండ వారింప, మీబుద్ధికిం
దోఁచు మార్గంబునన్ రాజనీతి ప్రకారంబు
నం దెల్పరే యన్న- వారందఱున్, దేవరా దీని
కైకొందలం బందఁగా నేటి, కిట్టీనరుల్ వాన
రుల్ దైత్యులం గెల్చువారే, భవద్భృత్యులం
దోకఁడే చాలఁడే వారలం బోరిలో గెల్వఁ
గా, నంత మర్యాద గర్వాంధులై పేలు వా
రిన్ నివారించి- హస్తద్వయుం గూర్చి ఫాలస్థ
లింజేర్చి, యకుంభ కర్ణానుజుం డగ్రజుం
గాంచి, మోయన్న మర్మాగుణాలో వీరిమాటల్
మది న్నమ్మరా, ధర్మహీనాయుతుం దల్పుఁడా
చూడ, సన్మాని హృత్కాప్పటకం దాటకందుర్పింపఁ

డే, విద్విష ద్దుర్నిరోధున్ విరాధున్ విదారిం
పఁడే, పెక్కు వేలక్రక్కసుల్ గొల్వఁపై వచ్చు
విరాధవీరున్ ఖరున్ జంపఁడే, మాయలం బన్నఁ
గాఁ జూచు మారీచు ఘోరాస్త్ర పాతంబునం
గూల్పఁడే యన్న, నమ్మేటి రామన్నతోఁ గం
టకం జేటికిన్- బ్రహ్మ వంశంబునం బుట్టి నీవన్య
దారన్ జెరంబెట్టియీనింద కిట్లోర్వఁగా నేల-
శ్రీ రామభూమీశుఁ డంభోనిధిం దాఁటి రాన
ప్పుడే, వానరుల్ యుద్ధసన్నద్ధులై యాత్రికూ
టాద్రి నుద్వృత్తితోఁ బెల్లగించె ప్రయత్నఁబు
గావించ కున్నప్పుడే, లక్ష్మణాస్త్రానల జ్వా
లలన్ మేఘ నాదాదులౌ పుత్రమిత్రాదులున్
మ్రగ్గకున్నప్పుడే, వేగనోభ్రాంత సీతన్ జగన్మా
తఁ గాకుత్స్థ భూనేత కర్పించవే యన్న- దో
షా చరేంద్రుండు రోషంబుతోఁ దమ్మునిం జూ
చి- హాలాహలజ్వాలలన్ గ్రాయుచున్ నాలు
కల్ గీటు కాలాహితోఁ బొందు నీపొంమ క
న్నన్ గదుమ్మేలు- నీరేజ పత్రంబునం దంబువు
న్నట్లు నన్ జెంది యున్నావు, నా పెంపుఁ జూ
పోపఁగాలేవు, దుష్టాత్మ, మా రాడుఁగా నోర్వఁ
గాలేను పొమ్మన్న- నాబంధుసంత్రాత నిన్ దా

తగాఁ జూతు నీవన్న నామీఁదటన్ రాజ వేము
న్నవన్నావు, నాకెన్నఁగా మన్న నేకాక వేఱు
న్నదే- దివ్యరత్నంబులుం దారహారంబులున్
నవ్య చేలంబులున్ భవ్యగంధంబులుఁ సౌర
భోపేత పుష్పంబు లత్యుత్తమాన్నంబులు న్న
త్త నూతంగముల్ భూమిజన్ గానుకల్ గా స
మర్పించి, భూజాని దర్శించి జోహారుగావించి,
మస్తుండటన్ బోవ్రుమీ- వల్లగాకన్న శ్రీరా
మ దివ్యాస్త్రజాలంబు లేతెంచి త్వత్పుత్ర పౌ
త్రాది దైతేయసంఘంబు సర్వంబు ఖండించు-
నాబుద్ధి మన్నించు, నాపలుకు త్వచ్చిత్తమం
దుంచు, నేజాటిపిన్పింతు. నీవెత్తఁగా లేని పం
చాస్యచాపంబు భగ్నంబుగావించె- కారాగృ
హాబద్ధుఁగా నిన్నుఁ గావించె నేధీరుఁ, డకాల
తఁవీర్యార్జునన్ క్షోణి భృద్బాహువు ల్వేయు
ఖండించె నేవీరుఁ, డాజామదగ్న్యుఁ ధనుర్వే
దతత్త్వజ్ఞు నిర్జించె- వాలంబుచే వీలుగా నిన్ను
బంధించి వారాశులన్ ముంచెనే నద్యశశ్శాలి,
యవ్వాలి నొక్కమ్మునన్ వీలగా నేలఁ గూలిం
చె- నీలంకనిశ్శంకతన్ గాల్చె నేనిర్జితారాతి,
యామారుతిన్ బంటుగా నేలె నేవానరాధీశుఁ,

జ వ్వానరాధీశు సుగ్రీవుఁ బెన్పంటుగా నేలె,
నేరాను భూనాయకుం- డాదురాధర్షుతో నీక్ష్య
సీకేల- ధాత్రీసుతన్ గాన్కగా నిచ్చి- మాంసా
పరాక్రం దయాయుగ్ధియా త్రాహి త్రాహి ప్రి
భో- యంచుఁ దత్పాద రాజీవముల్ గాంచి ప్రా
ర్థించవే యన్న- నేత్రంబులం జిత్రభాను స్ఫు
ర ద్విస్ఫులింగంబు లెంతే విచిత్రంబుగా రాలఁ
గాఁ, దమ్ముని గ్రూర దృష్టి న్విలోకించి, త
ద్వృక్షముఁ దన్నఁగాఁ- దక్షిణంబందు భూమి
స్థలిన్ వ్రాలి మూర్ఛిల్లి- వాలుగ్రీన్ గేల నం
కింపుచున్ వేృియ సంకింపుచున్ దగ్గరంబోవు
నంతన్- బ్రహస్తుంబు హస్తంబులం బట్టి ప్రా
ర్థించి సింహాసనాసీనుఁ గావించఁగాఁ- గుం
భకర్ణా నుజన్ముండు దెల్పొంది- యీలీలగాఁ
గ్రోధ మాత్సర్యముల్ నీమనస్సమలో నిండి
యుండంగ ధర్మాను కూలంబులౌ వాక్యజాలం
బులం దాదరంబుండునే మీకనన్- రాక్షసా
ధీశ్వరుం డాప్రహస్తాదులం బిల్చి, యీసంగ
రత్రిస్తు మద్వైరి పక్షస్థు నా స్థానముం దాఁటి
పోఁజేయరే, యంచుఁ బంపించఁగా- రోసి య
వ్వానవారాతి తమ్ముండు శోకాకులుండై దశ

గ్రీవునింజూచి- నీబన్నముల్ తిన్నగాఁ జూడలే
కీహితాలాపముల్ వల్కు, నీవల్కునన్నింతగాఁ జే
యఁగా వచ్చునే- భాగ్యమున్ బ్రాణమున్
బాయు దుష్కాల మేతెంచ క తార్కర్శ్యముల్
దోచునే నీకుఁ- గోపంబు దీపింపఁగాఁ జేయు
నాపల్కు- ఘోరాజిలో నస్మహారాజు బాణా
ళిచే లుంఠితంబైన త్వత్కంఠబృందంబు వీక్షించు
నాఁడేనియున్ మెచ్చవే- నేతవై యుండఁగా
నిన్ను సేవించు ప్రాప్తంబు చెల్లింది- హావేయు
నింకేల, నేబోయెదన్, పుత్రమిత్రాది సంఘం
బుతో సౌఖ్యమున్ జెందవే యంచుఁ- గన్నీరు
ముక్తామణుల్ రాలుచందంబుగా జారఁగా దీ
ఘుఁడై, మానుగా వచ్చి త్వత్పాద రాజీవముల్
గాంచి, హస్తాబ్జముల్ ఫాలభాగంబునం జేర్చి-
రామోధనుఃపక్షా విపక్షేభ హర్యక్ష నీరేజమి
త్రాన్వయాధ్యక్ష శ్రీరమ్యవక్షా సితాంభోజప
త్రాక్ష యుద్ధక్రియాదక్ష, యేనద్దశాస్యానుజుం
డన్ మహాపాతకుండన్ భవద్దాస్యమున్ గోరి
త్వత్సన్నిధిం జేరఁగా వచ్చితిన్- నన్ను రక్షిం
చు కారుణ్యదృష్టిం గటాక్షించవే యంచుఁ,
దానంత వృత్తాంతమున్ జెప్పి, ప్రార్థించఁ

గా, దిగ్గునన్ దగ్గరం జేరి- మీయన్న నన్నాజిలో
మార్కొనన్ భీతుఁడై, వార్ధిలోఁ జొచ్చినన్
స్వర్గమున్ జేరినన్ సర్వ లోకంబులో కేగి
నన్ వ్యోమమధ్యంబులో డాగినన్, మామకా
మోఘదివ్యాస్త్రముల్ వెంటనంటించి యారా
వణుం ద్రుంచి- దైత్యాధిపత్యంబునీ కిచ్చెదన్-
చేయునింకేల, బ్రహ్మాదులంగూడి సన్నద్ధుఁడైవ
చ్చినన్, యుద్ధరంగంబులో నద్దురాచారు స్వా
మాత్య యుక్తంబుగా మృత్యువున్ గూర్పలే, కే
నయోధ్యా పురిన్ జూడఁగాఁ గోరి నన్నైన,
మాతండ్రి పాదాబ్జయుగ్మంబుకున్ దప్పినట్లుం
చు- హస్తంబు తన్మస్తమందుంచి, నిర్భీతుఁగా
వించి- సౌమిత్రియు కుంభకర్ణానుజున్ లఙ్క
కకున్ రాజుఁగాఁ బట్టముల్గట్టవేయంచు మీరా
నతియంగ- నాచొప్పుగా నొప్పుగా నాచరింపం
గ- నీవంతవవ్వారిధిం దాఁట సర్వప్లవంగోత్త
మానీత శైలంబులన్ సేతుబంధంబు గావింప-
వా శైలముల్ క్రుంగఁగాఁ గాంచి- కార్యేచ్ఛ వా
రాన్నిధిం గూర్చి ప్రాయోపవేశంబుగా మూ
డహోరాత్రముల్ నిష్ఠతో సుష్ఠుగా నుండఁ
గా- స్వస్వరూపంబుతోఁ గంధి గన్పించఁ గాఁ గొం

డలన్ దండిగాఁ దేల్చుచున్నన్, మదిన్ గ్రోధ
ముజ్జెందె- వారాన్నిధిం జూచి తే లక్ష్మణా, వీం
తగా నాభయం బెంతయున్ లేక, యుత్తుంగరంగ
త్తరంగంబు లొండొంటికిం దాఁక, మిన్నంటఁ
గా బొంగియున్నట్టి యీబింక మింకింతు బా
ణాగ్నిచే- వేగఁ గోదండ మందీయవే- యంచు
వీల్లంది, దుర్వార నారాచ జాలంబు లావార్ధి
పైనేయఁ- దత్రుంధి చాలా భయంబంది యు
న్నంతఁ- గోపాగ్ని చల్లార్చఁగా లేక, బ్రహ్మా
స్త్రము న్వింట సంధించి, వారాన్నిధిం ప్రేయ
బూనన్- స్వదేహంబు గంపింప నావాహినీనా
థుఁడే తెంచి, త్వత్పాద కంజాత యుగ్మంబు ద
ర్శించి, తాహస్తముల్ రెండు జోడించి, శ్రీ
మచ్ఛుభాకార భక్తార్తి సంహార లోకైకవీరా
సదాచార సర్వాధికారా మహోదార యో
గీంద్ర చిత్తాబ్జ సంచార మోదీనమందార బ్రి
ష్టోస్త్రపాతంబు కే నెంతవాఁడన్, దయంజూచి
నా నేరమున్ గాచి రక్షించు- నీవేమి వైపించి
నన్ నీటిలో ముగ్గసిరుండఁగాఁ దేల్చు నేనన్నఁ-
గారుణ్యదృష్టి న్విలోకించి, నా యస్త్రరాజం బ
మోఘంబు, నేదీని నెవ్వారియందున్ బ్రయో

గింతు, నీవే దగం దెల్పవే యన్న- నాయుత్తరం
బంను పాపాత్ములై సాధు సంతాపకృత్తోగ్రవృ
త్తై దానవుల్ డాగియున్నారు, వారిన్మహాస్త్రం
బుచే రూపణం జేయవే, యంచు నవ్వాహినీ
భర్త విన్నవించఁగాఁ జాల హర్షించి- య
య్యుజ్జ్వలాస్త్రానల జ్వాల లాకూపార దైతేయు
లన్నిబుగాఁ జేయ నీవేయ. రాత్రించర వ్రాత
ముంజంపి, ధాత్రీస్థలిం దూటి పాతాళలోకంబు
లోనాటి, యయ్యస్త్రమే తెంచఁగా- వాహినీ
నాథుఁ డావింతకున్ సంతసంబందుచున్, రా
మ నీలాంబుదశ్యామ దేవారికాంతార దావా
నలుండౌనలున్ ముందుగాఁ బంపి, యుంపొందఁ
గాఁబొందుగా సేతువుంగట్టఁగా నాజ్ఞఁగావిం
చి, యాకట్టపై నేగి, నీ సేనలున్నీవు నీతమ్ముఁడుం
గూడి, బింకంబుతోఁ బొంకమౌ లంకసాధించి, వై
దేహి చేపట్టు, మన్నన్ ముదంబంది- సుగ్రీవనీ
లాంగదాదిప్లవంగేంద్ర సంఘంబులన్ జాంబ
వన్ముఖ్య భల్లూక యూథంబులం బంది, నానా
మహాశైల వృక్షాళిచే సేతువుం బ్రీతిఁ గట్టించి-
యుల్లాసివై వాసిగా వారిధిం దాఁటి- శాఖా
మృగాధీశ సైన్యంబుతో లంక కున్ లగ్గవట్టిం

చ- దుర్మార్గహస్తులన్ దేవతాద్రోహులన్ సా
ధుసంతాపకృద్దుష్క్రియామోహాస్పదులన్ గోప
మాత్సర్యయుక్కృత్రిమస్నేహులన్ నీల జీ
మూతసంకాశ భీకృద్బృహద్దేహులన్ దుర్యశ
శ్ఛన్నులన్ శౌర్య సంపన్నులన్· మేఘనాదాతి
కాయాకలా సూయులన్ వీర దైతేయులం గూ
ల్చి- జ్యావళీ నినాదాప్త దిక్ప్రాంచిత రాట్చక్ర ర్ణ
నిర్భేదనోద్దీప్త నకుంభకర్ణున్ వెసన్ ద్రుంచి-
దేవేంద్రసంప్రేషితస్యందనం బెక్కి- తేజంబు
రాజిల్లఁగాఁ జాలఁ జెంపెక్కి- యందేడ పూ
రాత్రిమల్ నీవులోకాపకారాంతి మర్త్యావుఁడౌన
గ్రౌశగిరిచుతో నాటమున్ లీలఁగావించి బ్రహ్మాస్త్ర
పాతంబునన్ సాధు విద్రావణున్ రావణుం
గూల్చి- యమ్మారుతింగాంచి- మత్ప్రేయసిన్నీవు
దర్శించి, నా గెల్పు చందంబు, నప్పట్టికంఠాది
రాత్రించరుల్ లేక నిర్జీవులైనట్టి చందంబునుం,
జెప్పిరమ్మన్న- నవ్వాయుజుండట్టు లద్దేవిక్కిం దె
ల్పి యేతెంచి, వైదేహిసందేశమంబొందుగాఁ
జెప్పినన్- నీవు నయ్యంభకర్ణానుజుంజూచి- సీ
తాంగనన్ రంగగా మంగళస్నాతఁ గావింప,
సద్వస్త్రభూషా సుగంధానులేపాది శోభితఁ

గావించి, రావింపుచూ యన్న. నక్తంచరాధీ
శ్వరుండేగి, యాలీల శృంగారమున్ గాంతలం
బంచి చేయించి, త్వత్సన్నిధిం జేర్ప- వైదేహి
తానీవు నిర్మోహవాక్యాస్త్రజాలంబుచే ఖి
న్నయై, కన్నులన్నీరు మున్నీరుగా జారి వక్షో
రుహద్వంద్వమున్ జార- హానాథ నన్నిట్టియ
న్యాయముల్ బల్కుటల్ న్యాయమా నీకు, వై
దేహి పాపాత్మురాలంచు నీచిత్తమందుం దవద్దం
చు, నేచిచ్చునం జొచ్చి యేతెంచఁగా మెచ్చెదీ
వంచు- దీప్తాగ్నిలోఁ జొచ్చి సంశుద్ధ రాలైన
చోఁ జేరి- సీతన్ జగన్మాత నశ్రాంతమున్ పూ
తఁగా స్వాంతమం దుంచవే యంచు- బ్రహ్మాది
రుద్రాము లేతెంచి ప్రార్థింపఁ జేపట్టి మన్నిం
చి- సాకారి సద్భక్తలోలా కృపాశీల నీవేమి
గాంక్షించినన్ సంతసం బొప్ప నర్పించెదన్
గోరవే యన్న- నాకున్ సమస్తంబు ప్రాణం
బు, కోర్కుల్ మదిన్ గల్గ, వత్సైన నొక్కింత
నే వేఁడెదన్, నానిమిత్తంబుచే వానరుల్ ఘో
రయుద్ధంబులోఁ జచ్చినా, రిత్తతిన్ వీరిప్రాణం
బు లీవిమ్ము, శాఖామృగాధీశు లెంచన్న నం
దెల్ల వృక్షంబులున్ బండ్లతో నుండఁగాఁ, గంద

మూలాదులన్ స్వాదు నీరంబునుం గల్గియుం
డంగఁ జేయంగదే యన్న - నాతండు వాలీలగా
మేలుగాఁ జేయ - వైతేయ బాణాహతిన్ గన్నకా
యంపు గాయంబులం బాసి భాసిల్లుచున్, వాన
రాధీశ్వరుల్, నిద్ర మేల్కన్న చందంబుగా
లేవఁగా, సంతసంబందుచున్ - బఙ్క్తికంఠా
నుజున్ బట్ట మాచన్ద్రతారార్కమై యుండఁగాఁ
గట్టి - సీతాసుమిత్రాత్మజాతుం గూడి, సేనా
సమేతంబుగా, యక్షురాట్పుష్పకం బెక్కి -
భూజాతకున్ ద్రోవలో నాజివృత్తాంతముల్ దె
ల్పుచున్ - జక్కనౌ బెక్కు దేశంబులున్ వాహి
నుల్ గానలున్ గోనలుఞ్జూపుచున్ జాగి - వే
గన్ భరద్వాజ మౌనీంద్ర సాన్నిధ్యమున్ జే
రి, సద్భక్తిచే మ్రొక్కి - యయ్యంజనానందనుం
జూచి - మా కైకయీపుత్రు నీక్షించి, తద్భావ
ముం గాంచి, నా రాక విన్పించి రమ్మంచు బొమ్మం
చు నేఁ బంపఁగా. నాహనూమంతుఁ డమ్మేటిద
ర్శించి, యుష్మత్కథాజాలమున్ లీలగా నంత
యున్ జెప్పఁగాఁ - జాలహర్షించి శత్రుఘ్ను
వీక్షించి, నీ వయ్యయోధ్యాపురం బెల్ల శోభిల్లఁ
జాలాపతాకాద్యలంకార సంపత్తి రంజిల్లఁ జే

యించుచున్, యుత్సవం బెల్లెడన్ జాటఁ బంపిం
చున్, సింధుబంధాది చిత్రంబు లెల్లన్ విచిత్రం
బుగా రాజవాగార మధ్య ప్రదేశంబులన్ వే
గ వ్రాయించుచున్, జానకీ మందిరం బెల్ల రమ్యం
బుగా భూషించుచున్- దుష్టుఁడౌ రావణుం ద్రుంచి
యేతెంచె మా రాముఁ, డెల్లుండి పట్టాభిషిక్తుం
డగుంగాన మీరెల్ల రానర్హులంచున్, సమస్తావ
నీనాథులం బోడి తెప్పించవే, యంచు బంపింపఁ
గా- నాతఁడున్ వేగ సాకేతమున్ జెంది, తా న
ట్లుగావించి, సంప్రీతితో మాతులం జేరి, మీ రాక
విన్పించఁగా- వారలున్ బంధు మిత్రాది భూ
మీశులన్ దోడరా, నుత్సవం బొప్ప శత్రుఘ్నుఁ
డేతెంచి, తత్సోదరుం గాంచి సేవించ- వారం
దఱుం గూడి యుష్మత్పదాంభోజముల్ గాంచి-
త్వత్సోదరుల్ మ్రొక్కి దీవించి, మీ యంకపీ
ఠంబు వంకంచి మన్నించి- కౌసల్యకున్ గైక క
ట్లా సుమిత్రా మహాదేవికిన్ వేడ్క- సాష్టాంగ
దండ ప్రణామంబుఁ గావించి- వారెంతయున్
బ్రేమ బూరంగ దీవింప నద్దీవనల్ సెంది- తత్పు
ష్పకం బక్కడన్ డిగ్గి పూజించి యక్షేశ్వరుం
జేరఁ బోఁ బంప- తానంత నా నిష్టదైవంబులౌ

పాదుకల్ గొంచు నక్కైకయీ పుత్రుఁ డే
తెంచి సేవించి- నీయాజ్ఞ నేనిత్య మీపాదుకా
ద్వంద్వముఁ బూజగావించి సేవింప, రాజ్యా
ధికారంబు నర్పించి, ధాత్రీతలంబెల్ల నేర్పొప్పఁ
గాఁ దప్పు లేకుండఁ బాలించినాఁ డంచుఁ- దత్పా
దుకల్ దత్పదాబ్జంబులం గూర్చి భూభార మ
ర్పించి- యీ తాపసాకారమున్ వేగ వర్జించి,
భూపాల వేషంబుతో నిటికీవేళ వంచేయవే,
యంచుఁ బల్కం- గటాక్షించి. సైదోడులం గూడి,
యభ్యంగన స్నానమున్ లీలఁ గావించి- హేమాం
బరపుట్టంబులొయ్యారమింపారఁగాఁ దాల్చి,
వేసిస్తుగాఁ గోవ కస్తూరిబొట్టొప్పగాదిద్ది, పాటీ
రపంకంబు నీటొంద మైఁబూసి, రత్నప్రభాదీ
పితంబైన యాకల్పముల్ పొల్పమీరంగఁ గీలొ-
ల్పి- సందాత్ములై యిందు లందంద సేవింపఁ బూ
ర్వాద్రిపై నొప్పు పూర్ణేందునిం బోలి య
త్యున్నతంబైన తేరెక్కి- ముక్తాతపత్రంబు కై
కేయి పుత్రుండు పట్టంగ, సౌమిత్రి శత్రుఘ్ను
లత్యంత సంతోషిత స్వాంతులై భక్తితోఁ జా
మరల్ వీవఁగా- ముందఱన్ వెనుకఁ బార్శ్వ
ప్రదేశంబులన్ మానవాధీశ్వరుల్ రాతుసాధీ

శ్వరుల్ వానరాధీశ్వరుల్ గొల్వ- నస్మానులున్
బ్రహ్మవిద్వాంసులున్ వాహనారూఢులై గూడి
రా- వెంటఁ గౌసల్యతో కేకయాధీశ పుత్రి సు
మిత్రాబ్జపత్రాక్షులున్ కీశ కాంతామణుల్
వేడ్క నేతేర- సీతా సమేతుండవై బాగుగా నే
గఁగా- వాంశికుల్ వైణికుల్ గాయకుల్ పా
ఠకుల్ మాగధుల్ భాసురుల్ వందిబృందంబు
లున్ సందడిన్ మంగళధ్వానముల్ సేయ- న
త్యంత శృంగార భంగియుతాంగులుం బొల్చు
వారాంగనల్ నృత్యముల్ సల్పఁగాఁ బంచవా
ద్యమ్ములున్ మ్రోయఁగా- జాంబవంతుండు నీ
లుండు రంభుండు తారాదులున్ హేమవేత్రం
బులం బూని, సొంపారఁగా భూసుర క్షత్రవి
ట్ఛూద్ర సద్మద్వారమున్ దాపుచున్ బోవ- పు
ణ్యాంగనారాజి నీరాజనంబుల్ మహాభక్తిచేక
త్రిచే నీయఁగా- రాజమార్గంబులో రాజసం
బొప్పఁగా రాజబింబాననల్ గమ్యహర్మ్యంబు
లందుండి లాజప్రసూనాక్షతల్ ముత్యముల్ చ
ల్లఁగా- సర్వసైన్యంబుతో వైభవంబొప్ప సా
కేతనముం జెంది- పట్టాభిషేకోత్సవ శ్రీలఁ జె
న్నొంది- దుర్మార్గులం బట్టి శిక్షించి, సత్సా

గుణాలం గాచి రక్షించి- ధాత్రీజన వ్రాతమున్
బుత్రసంఘాతమున్ గావిచారించి- వాతాగ్ని
నీరంబులున్ మీఱరాకుండ వారించి- పృథ్వీస్థ
లిన్ స్వర్గ తుల్యంబుఁ గావించి- యాఱైదు
వేలేడు లేకాధిపత్యంబుగా భూమి పాలించవే-
దేవ సంసార వారాశిలో నీదు నన్నున్ మదీ
నే సుభద్రియ్యనాసొప్పు దాసానుదాసిన్ గృ
పాదృష్టి నీక్షించి- త్వత్పాద కంజాత పోతం
బునం దుంచి- తత్కారణాధారుండవై, నీదుము
ఖ్యాస్పదంబైన వైకుంఠమున్ పారముం జేర్చి-
రక్షించు రక్షించు- ధారాధరశ్యామ లోకాభి
రామా నతాబ్జాత భౌమా రమాకామ వైకుంఠ
ధామా సురారాతిభీమా రణోద్దామ భూపా
లసుత్రామ రామా నమస్తే నమస్తే నమః॥

శ్రీమతే రామానుజాయ నమః.



శ్రీరాములు.

శుభమస్తు. అవిఘ్నమస్తు.

# శ్రీ కోదండరామశతకము మొదలగు వానిలోని పద్యములు.

# STANZAS FROM SRI KODANDARAMA SATAKAMU &c.

శ్రీవైష్ణవాంబుధి శీతకరుండన- ధారణిపైనవతారమొంది। చేతనరక్షణ సేయంగ మది నెంచి- శ్రీవత్స గోత్రంబు సిరులు మించ। రామానుజాచార్య రమ్యనామముం బూని- దాక్షిణ్యమొప్పంగ దాసులకును। గురుపరంపరయును గుదురుగఁ దిరుమంత్ర- రాజము ద్వయమును గ్రమముగాను॥ లలిత చరమార్థ మంతయుఁ దెలియఁజేసి। వనజలోచన భక్తుల మనిచినావు। చారు వైశాఖపురధామ జగ్గరాయ। దాసహృదయాబ్ధిసోమ కోదండరామ॥౧॥

శ్రీవధూకామ రక్షితనతసుత్రామ- ధారాధరశ్యామ దనుజభీమ। పతితపావననామ భవనాశనోద్దామ- నవతులసీదామ భవుకసీమ। నిహతఖలస్తోమ నిర్జితభృగురామ- శుభగుణారా

మ రక్షో విరామ। నిఖిలరాజలలామ నిగమప్ర
స్మృత భూమ- యవనిజన్యా హృదయాభిరామ॥
రాజ దమరావతీనాధరత్న ధామ। జలజభవ ము
ఖ్య దేవతాసార్వభౌమ। చారువైశాఖపురధా
మ జగ్గరాయ। దాసహృదయాబ్ధిసోమకోదండ
రామ॥౭॥

దశరథేశ్వర పుత్ర దానవకులజైత్ర- భక్తా
బ్జమిత్ర పావనచరిత్ర। పాలితరవిగోత్ర పాక
శాసనమిత్ర- సీతాకళత్ర రాజీవనేత్ర। నార
దస్తుతిపాత్ర నీరదనిభగాత్ర- ధవళాంశువక్త్ర
సంతతపవిత్ర। యాచితకౌశికసత్త్ర యాప్తభూ
రుహచైత్ర- విద్విష తాటకానన విలిహూత్ర॥
దారుణోదగ్ర దురిత లతాలవిత్ర। భూరి ధైర్య
నిరాకృతమేరుగోత్ర। చారువైశాఖపురధామ
జగ్గరాయ। దాస హృదయాబ్ధి సోమ కోదండ
రామ॥౮॥

సకలశుభాచార సన్మునిమందార- జలరాశి
గంభీర ఖలవిదార। భక్తార్తిసంహారగ పాపావళీ
దూర- యతిమనోహర లోకైకవీర। శాంతి
గుణాగార సర్వవిద్యాధార- సుందరాకార
యానందపూర। దీనపోషవిచార దివ్యగుణోదా

ర- భూరిదయాసారపూర్ణ ధీర॥ ధీరమాకా
మినీ మణిచిత్తచోర। పంక్తిరథనామ మేదినీపతి
కుమార। చారువైశాఖపురధామజగ్గరాయ। దా
సహృదయాబ్ధిసోమ కోదండరామ॥ ౪॥

సీతాహితాశ్లేష సింధుభీషణరోష- కలితా
ర్యఘుఘోష లలిత వేష। ఘనదయా పీయూష
కౌస్తుభమణిభూష- విరచితామరతోష విగతదో
ష। కృతవిద్వదభిలాష ఖిన్నచేతనపోష- వితత
ఖలద్వేష చతురభాష। విదిత సర్వవిశేష విహి
తవిప్రోన్మేష- హాసుందరమోష పాపౌఘశోష॥
గురు మహిమాతిశాయి భాసురమనీష। గాఢనతమ
ర్త్య మోహాంధకారపూష। చారువైశాఖ పుర
ధామ జగ్గరాయ। దాసహృదయాబ్ధిసోమ కో
దండరామ॥ ౫॥

విదళితేశ్వరచాప విజితలంకాద్వీప- రవివం
శదీప తీవ్రప్రతాప। విదితశాస్త్రకలాప విహిత
వాయసతాప- కుసుమేషురూప తామసదురా
ప। శ్రుతిమధురాలాప కృతఘ్నతాతివిలోప- క
రుణానదీప యక్షయకలాప। సజ్జనవిక్షేప శ
త్రుభీకరకోప- కుటిలప్రతీప సద్గుణకలాప ప్రా
ప్తనరరూప హృతదానవావలేప। రాఘవక్ష్మా

ప యంచితామోఘ రూప। చారువైశాఖ పుర
ధామ జగ్గరాయ దాస హృదయాబ్ధి సోమ కో
దండరామ ॥౬॥

రావణమర్దన రాజీవలోచన- మారీచసూ
దన మహితకదన। వాలివిధ్వంసన భూలోకపా
లన- పాపవినాశన రూప మదన। వారిధిబంధన
వసుధేశనందన- సురనాయకావన సుభగవదన।
హరచాప ఖండన హరివంశమండన- వరభక్తి
వర్ధన వనధిసదన॥ శార్ఙ్గముఖదివ్యసాధన స
రసహాసన। మునిమనోనిత్య నివసనకనకవసన।
చారువైశాఖపురధామ జగ్గరాయ దాస హృద
యాబ్ధిసోమ కోదండరామ ॥౭॥

దశముఖ ప్రతిపక్ష దైవతావనదక్ష- పాం
డవపక్ష శ్రీవత్సవక్ష। పరవీరమాతంగ భంజనహ
ర్యక్ష- ఖరదూషణ సంశ్రితకల్పవృక్ష। జనపోష
ణదీక్ష భాను వంశాధ్యక్ష దళదంబుజాక్ష శీతల
కటాక్ష। ఘోరదానవశిక్ష కోపవిరూపాక్ష- ద
త్త దాసవిమోక్ష దానయక్ష॥ కలితమౌనిజనా
పేక్ష గతజితోక్ష। విహతమకరాక్ష విహితభూ
విబుధరక్ష। చారువైశాఖపురధామ జగ్గరాయ।
దాసహృదయాబ్ధిసోమ కోదండరామ॥౮॥

దండంబు పద్మజాఖండలాది స్తుత- దండం
బు దానవదర్పదమన। దండంబు కృతకరి దైన్య
నివారణ- దండంబు శత కోటి తరణి తేజ। దం
డంబు పరిఖిన్న తాపస రక్షణ- దండంబు ప్ర
హ్లాదతాపహరణ। దండంబు కలశాబ్ధి తనయామ
నోహర- దండం బఖండ భూమండలేశ॥ వంద
నము నీకు సనకాది వందనీయ। మ్రొక్కెదఁ గైకొ
ని కరుణించు మోహనాంగ। చారువైశాఖపుర
ధామ జగ్గరాయ। దాసహృదయాబ్ధిసోమ కో
దండరామ॥౯॥

విఘ్ననాశనకర్తకు విబుధారికులహర్తకు- విష్ణు
సేనాధ్యక్షుకు విమల రూపకు। సకలవిద్యాధుర్యు
నమ్మునిస్తుత చర్యు- పరమ పారాశర్యుఁ బ్రస్తుతిం
చి। యతిరమ్య గుణసాంద్రు నభినవ చంద్రుఁ- శ్రీ
నివాసబుధేంద్రుఁ జేరి మ్రొక్కి॥ రసికజనముల
మనములు రంజిలంగ। సీసశతకంబు వినుపింతు
చిత్తగించు। చారువైశాఖపురధామ జగ్గరాయ।
దాస హృదయాబ్ధి సోమ కోదండరామ॥౧౦॥

సీతాసతీనాథ సేవనీకొసరింతు- నేఁ జేయఁ
బూనిన నీదు కృతిని। మానుగా నవరస మాధు
ర్య గాంభీర్య- వాగ్గుంఫనంబుల సరల జేయ।

నాక నీనామముల్ నాపలుకఁ దప్పవు. బాయం
గఁజేయు సుపర్వతటిని। తనయంపుగ్రొంకు పా
తకుల పాపంబుల. నపుడె పాయఁగఁ జేయు న
ట్టినంత॥ బుధులు మెత్తురుగద నిన్ను బోగద నవ
ని। దుర్మతులు నిందసేసిన దోసమేమి। చారు వై
శాఖపురధామ జగ్గరాయ। దాసహృదయాబ్ధిసో
మకోదండరామ॥౧౧॥

గరుడ విద్యాధర గంధర్వచారణ- యక్ష కి
న్నరముఖ్యు లమరవరులు। సనకాది మునులును
సకల స త్క్రతువులును. నిఖిల లోకంబులు నిగమ
ములును। పద్మసంభవుఁడును వాక్పతీశ్వరుఁ
డును- సురగణగురుఁడును సురగవిభుఁడు। నిన్ను
సన్నుతిసేయ నేరరుతగ రీతి- నాకు వశంబౌనె
లోకవంద్య॥ భవభయంబెల్లఁ బాయనో భక్త
వరద। తోచు క్రమమున నుతియింతుఁ దోయ
జాక్ష। చారువైశాఖపురధామ జగ్గరాయ। దా
సహృదయాబ్ధిసోమ కోదండరామ॥౧౨॥

పల్లవంబులమీరు పాదయుగ్మముతీరు- భుజ
గంబులను గెల్చు భుజయుగంబు। రాకేందు చెలు
వు నిరాకరించును మోము. కమలంబులను గేరుఁ
గన్నుదోయి॥ బంధుజీవములీవిఁ బరిహసించుమ

మోవి- కాంచనపుష్పంబు మించునాస। మద
నుని ధనుఃణంబు నదలకించును బోమల్- ముకు
రంబులనుబోలు ముద్దుచెక్కు-॥ లందమగు నీదు
రూప మెల్లపుడు నామ। మానసంబున బాయ
దు మరువవశమె। చారువైశాఖపురధామ జగ్గ
రాయ। దాసహృదయాబ్ధిసోమ కోదండరామ॥

మచ్ఛంబవైయబ్ధిఁ జొచ్చి సోమకుఁద్రుంచి-
వేధకిచ్చితి శ్రుతుల్ సాధులీల। మందరం బం
భోధి మగ్నంబుగాఁజూచి- కూర్మమైయెత్తితిగో
వులలర। సితవరాహంబవై క్షితినుద్ధరించితి- క
నకాక్షునా[illegible]వంబున వధించి। నరసింహ మూ
ర్తివై వరభక్తుఁ బ్రోచితి- కనకకశిపు నల్కఁదు
నిమివైచి॥ పరగ వామనతనువొంది బలిని వేఁడి।
యింద్రునకు ముజ్జగంబులనిచ్చితీవు। చారువైశా
ఖపురధామ జగ్గరాయ దాసహృదయాబ్ధిసోమ
కోదండరామ॥౧౮॥

పరశురాముఁ డనంగ ధరఁబ్రసిద్ధివహించి-
పలుమాఱు వెదకి రాజుల వధించి। భూమిఁగశ్య
పునకుఁ బ్రేమతో నర్పించి- మునివృత్తి నుంటివి
ముదము గదుర। దశరథాత్మజుఁడవై దశకంధరు
నిఁగూల్చి- శ్రీదేవిఁ దెచ్చితి చెలువుమీర। బలుఁ

డవై దైత్యులం బలువురం బొలియించి- భూభార
మడంచితి బుధులు పొగడ॥ నసురవంచన బౌద్ధుం
డవైయొనర్చి। తిరంగవధింతువు కల్కివై యెల్ల ఖ
లుల। చారువైశాఖ పురధామ జగ్గరాయ। దాస
హృదయాబ్ధిసోమ కోదండరామ॥౧౫॥

తల్లియుం దండ్రియుం దాతయు దైవంబు-
సకల బాంధవులును సఖులు నీవె। నీ పదాబ్జం
బులే నేనమ్మితినిచాల- నీకన్న మఱి దిక్కు నా
కుం గలదె। కోరికలెడలించి కూర్మినన్నేలవే-
మగుణంబులం బాపు దురితదూర। జగతి నిన్
బోలు రక్షకుం డెందు గలుగరు- తలంపనన్ బో
లు పాతకులు లేరు॥ పతితపావన నీకన్న నితరు
లెవరు। నన్ను గావ సమర్థు లనాథనాథ। చా
రువైశాఖపురధామ జగ్గరాయ। దాసహృదయా
బ్ధిసోమ కోదండరామ॥౧౬॥

వరగౌడవంశాబ్ధి పర్వశశాంకుండు- పూ
త చరిత్రుండు పుణ్యరతుండు। ఘన యశోనిధి
యానై యొనరు జగ్గారాయ- వలనం జెల్లమ గ
ర్భ ఫలమునందుం। బ్రభవించి మదినే సుభద్రి
యంచును జను- లనఁగను నీదాసినైన నేను। నను
బ్రస్తుతించితి నేర్చిన భంగిని- నిరతంబు కుద

మొప్ప నీవు నాదు॥ హృదయమునుండి భవ
బంధ మెడలఁజేయు। తప్పులోఁ గోని కరుణించి
దాస్యమొసఁగి। చారువైశాఖపుర ధామజ్ఞరా
య। దాసహృదయాబ్ధిసోమకోదండరామ॥ ౧౭॥

ఘనకవీశ్వరులార కారుణ్యపరులార - పండి
తోత్తములార భవ్యులార। మీకానతులు భక్తి
మీరంగఁ గావించి - విన్నపంబొనరింతు వినయ
మొప్ప। గణవర్ణనియమ ప్రకారంబు లెఱుఁగ
ను - యతిప్రస్తతియుఁ బ్రాసగతియు నెఱుఁగఁ। ●
దాత్మకుఁ బొగడఁ బాపము వాయుననుచును -
జేసితి నీకృతి చిత్తగించి॥ పరిహరించక కుఁడీ
యుంచు నెరసులున్నఁ। జక్కఁగా దిద్దఁడీ సుప్ర
సన్నమతిని। నీరసమ్ముఁను పారస్యనిధులఁ జేయు।
వారెకద పెద్దలెన్న నీవసుధలోన॥ ౧౮॥

(సీసమాలిక) సకలాగమోద్ధాన జలచ
రేంద్రునిరక్ష - కమఠాధినాథుని కలితరక్ష। పో
త్రికులాంభోధి పూర్ణసోముని రక్ష - సింహా
ద్రిపతి నరసింహు రక్ష। వైకుంఠవాసుని వా
మనాత్ముని రక్ష - పరశురామేశుని పరమరక్ష।
రవికుల తిలకుని రామచంద్రుని రక్ష - రాజస
హాదుహల ధరునిరక్ష। బుద్ధజనసన్నుత బుద్ధదే

పునిరక్ష- కమనీయ లావణ్య కలికి రక్ష। గోపికా
లోలుని గోపాలునిరక్ష- తిరువేంగడత్తాను కర
మురక్ష। శేషావతారుని శ్రీధరుసంరక్ష- తామ
రసాక్షు మాధవునిరక్ష। కౌస్తుభభూషణు గరు
డవాహనురక్ష- భాగవతోత్తమ భవ్య రక్ష॥ ధ
న్యచరితుని హరిజనార్దనుని రక్ష। సవనపరిపా
లకుండు కేశవుని రక్ష। నీరజోదర వరమౌని నిత్య
రక్ష। రాఘవునిరక్ష గోడెజగ్గరావు కెపుడు॥ ౧౯



ఈరేడులోకముల్ ధారాళముగనుండు- భ
వదాజ్ఞ లోపల భక్తవరద। జనులుభవాబ్ధిలో ము
నిఁగి తేలుచునుండఁ- గనికరించవు గదా కలితచ
రిత। కనికరించకయున్న జనులబాధను గూర్చి- క
లితోక్తులాడవు కమలనయన। కలితోక్తు లాడక
కలుషాత్ములని వారిఁ- బరిహరించెదవేల పరమ
పురుష॥ తగవు చెప్పంగనీకొరుల్ తగరుగాని। ప్ర
జలఁబాలించకుండుట పాటిగాదు। దీనమందార
నీకంటె దిక్కు గలదె। వర విశాఖ పురాధీశ
హరి రమేశ॥ ౧॥

భవదాజ్ఞ లేకున్న భాసురంబుగఁ బత్రి- నై
నవలించునా మధుర భావ। పరగఁ జేతనులకుఁ

పాప పుణ్యంబుల- కధికార మున్నదా యసుర
మథన। కొందఱు సౌఖ్యంబు గొనెదరు దుఃఖంబు-
కొందఱు మోక్షంబు గొందఱధిక। నారకంబులఁ
జెంద నయచారివయ్యాను- వీక్షింపవేటికి విమల
చరిత॥ దీనరక్షక కరుణానదీప యనుచు। నన్ను
నింతురురిను సురల్ జనులకెల్ల। హితవుగాము
క్తి యొసఁగని హేతువేమి। వరవిశాఖ పురా
ధీశ హరిరమేశ ॥౨॥

ఈరేడు లోకముల్ తాలుమా ఆనరింపఁ-
బుట్టింపరక్షింపఁ బొలియఁజేయ। కర్త వింతి
యెకాని గాసహాలైయున్న- సకలభూతములకు
సమూచితముగ। దుర్బుద్ధిఁ దొలగించి దోషంబు
లనణంచి- యుష్మత్పాదాంభోజ యుగళమందు।
సద్భక్తి గలిగించి సంసార మెడలించి- హాయు
జ్య మొనరూపఁ జాలవో కొర॥ జీవులను మా
యాపైఁగప్పి చిక్కువఱచి। మోక్షయత్నంబొ
నర్చరు మూర్ఖులనుచుఁ। బరిహరించిన దికేల
ది పరమ పురుష। వర విశాఖ పురాధీశ హరి
రమేశ॥౩॥

కాంతుండు లేకున్నఁ గడుపేదయైయున్నఁ-
బుత్రులు బాలతఁ బొంది యున్న। మిత్రులు శ

తుర్లై మేలెఱుంగకయున్న- తిరిపెమేయూరను
దొరకకున్న। దీనపోషకుఁడైన దేవరత్నామణి-
కనికరంబెడఁ బూని కావకున్న। తన సహోద
రులకు ధనధాన్యసంపదల్ - కరము ప్రభుత్వంబు
గలిగియున్న॥ భ్రాతృగృహవాస మింతికి భవ్యమ
గునె। వారి కుటిల వచశ్శరవ్రజము నాటి। బా
ధపడు కంటె దేహంబుఁ బాయుటొప్పు। హీన
మైయున్న బ్రదుకేల మానినులకు॥ ౪॥

పాపకారులఁ గొల్వక భవముదొలఁగఁ। ద
లచి శౌరిని భజియింప ఫలముగలదె। క్షుధితుసి
ద్ధాన్న మొల్లక క్షుద్రమతిని। సారవగు ధాన్య
మును గోరసౌఖ్యమగునె॥ ౫॥



శ్రీరంగా భవదంఘ్రి నీరజములేఁ జింతింతు
త్వద్దర్శనం। బేరీతిన్ ఘటియింపఁ జేసెదవొ
నాకా యాత్ర సిద్ధింపఁగా। సార ద్రవ్యము
ప్రాపు దాపు వరదా సర్వంబు నీవేసుమీ। నే
రం బెంచక నన్ను జేపట్టఁ గదవే నీ చెంత
రంగేశ్వరా॥ ౧॥

రంగారంగ యటంచు నిర్మలముగా రాజిల్లు
కావేరిలో। శృంగారంబుగ గ్రుంకి భక్తి దన

రన్ శ్రీవైష్ణవ స్త్రీలతో। రంగుల్ మీరిన భూ
షణా వళులతో రమ్యంబు దీపించ నుత్సాంగ
ని న్ను భజింప వేడుకయెడున్ బూజింప రం
గేశ్వరా॥౨॥

నీ కారుణ్యము గోరియుందును గదా నిన్నా
త్మ భావించెదన్। నీకంటెన్ మఱి దిక్కువే తె
గలదా నెయ్యంబుతో బాంధవుల్। లోకుల్
వెంట జనంగనేగి నిను నాలోకించు భాగ్యోన్న
తిన్। సాకల్యంబుగ నా కొసంగు సుయశా స
ర్వేశ రంగేశ్వరా॥౩॥

ధారాళంబుగ మత్పహాదకుని చేతన్
నిన్ను దర్శింపఁగా। సారాచారముగాఁగ నా
జ్ఞ గొని నే సంతోషిత స్వాంతనై। వారుల్ తం
డర నొంద వేగిరముగా సద్భక్తి సేవింతు నా
భారంబెల్ల వహించు రంగమునకుం బంపించు
రంగేశ్వరా॥౪॥

(మత్తకోకిల) మేలుగాఁ బ్రతిమాలఁగాఁ
జలమేలరా వెత జాలురా। జాలి నొందఁగ లే
నురా నిను సన్నుతింపఁగఁ జాలరా। మేలునీవయ
రాదురా నను నేలరా వగఁ బాపరా। జాలమేల
విశాఖపట్టణ జానకీ హృదయేశ్వరా॥౫॥

( మత్తకోకిల ) ఎంతవేఁడిన నూరకుందువు యెప్పుడుం దయ చేయువో । పంతగించుట కెంత దానను బ్రాఁపు నీవని నమ్మితిన్ । అంత కంతకు లావు దప్పును నాలసంబిఁక నేలనీ । చెంత నుండెద రంగధాముఁ జేసఁవే పరమేశ్వరా ॥౬॥



దేవా నే నపరాధినైతిఁ దొలుతన్ దేజంబు రాజిల్లఁగాఁ । గ్రావిణ్యంబున వైష్ణవోత్తములు తత్త్వాటీరమున్ బాపఁగా । నావేళన్ భవదీయ సుందరతనాకల్పంబు గాఁ దోఁచ నీ । సేవల్ తప్పు క్షమించి నాకొసఁగవే సింహాచలాధీశ్వరా ॥౧॥

వీసంబైన వివేకమున్ సుగుణమున్ విజ్ఞానమాచారమున్ । వాసిన్ బుణ్యము నేనెఱుంగను మనోవాక్కాయ కర్మంబులన్ । దాసిన్ నన్ను తరింపఁ జేయుటకునై దాక్షిణ్య భావంబుతో । శ్రీపారంబగు భక్తి యుక్తు లిడవే సింహాచలాధీశ్వరా ॥౨॥

సామీ భాగవతాపచారములు నే సర్వంబు గావించితిన్ । సామాన్యంబులు గాని పాతకములన్ సంతోషనై చేసితిన్ । నా మోసం

బున కెద్దిమేర వినతిన్ నాధారమున్ బూని నా।
సేమం బించుక చింత సేయవె దయన్ సింహా
చలాధీశ్వరా॥౩॥

నీ సామర్థ్యక మెఱుంగఁ జాలరు సురల్ నీ
తేజ గర్భాననులున్। నాశీలంబును విన్నవించితిఁ
గదా నాదుర్వశంబౌనె నా। యాశా పాశ
ముఁ బాపి మన్మనములో నశ్రాంతమున్ నిల్ప
వే। శ్రీశా త్వత్పదపంకజాత యుగమున్ సిం
హాచలాధీశ్వరా॥౪॥

దైవాధీనము లోకము। శ్రీవరు నాజ్ఞకును ద
ప్ప శివునకు వశమా। యేవిధిని గల్గు మోక్షము
భావజగురుఁ డివ్వకున్నఁ బ్రాజ్ఞుల కైనన్॥౫॥

మునివరులకు శ్రావకపద। వనజంబులయం
దు భక్తి వడి నొసంగితి చే।తనులకుఁ గలిగించిన
వా। రెవ్వరు నినుదలచలేరె యంబుజనాభా।



## శ్రీరాములు.

## శ్రీరఘునాయకశతకము.

## SRI RAGHUNAYAKA SATAKAMU.



శ్రీ కరుణాకరా చరణసేవక లాలస భక్త
సాదరా। లోకమనోహరా విబుధలోకవరా గు
రురాజశేఖరా। భీకరసంసృతిద్రుమ విభేదనిశా
త లస త్కుఠారధారా। కలుష ప్రవర్గ భిదు
రా యతినాయక దీనపోషకా॥౧॥

శ్రీ రమణీకళత్ర సరసీరుహనేత్ర జగత్ప
విత్ర స। త్సారసబృంద మిత్ర సురసన్నుతిపా
త్ర నరేంద్రపుత్ర శృం। గార సమగ్రగాత్ర జ
నకగ్నవిదారణ కృచ్చరిత్ర శ్రీ। నారదమౌని గీ
తచరణా రఘునాయక దీనపోషకా॥౨॥

వరకరుణానిధీ విమలవాదవిధీ గుణరత్నవా
రిధీ। వరరథసారథీ విహగనాథరథీ విహితార్య
సన్నిధీ। పరికలితేషుధీ విపులభవ్య సుధీ గతదై
భవావధీ। స్థిరముగసన్నుతించెదను శ్రీరఘునా
యక దీనపోషకా॥3॥

సకలగుణాభిరామ మునిసన్నుత నామ సు
రారిభీమ పావకసఖనందన ప్రమదవారిధిసో
మ ధరాలలామ ఘోరకుమతదైత్యనికంచయ
విరామ పరాక్రమ కీర్తిధామ రామకమల
ధామరామ పరమా రఘునాయక దీనపోషకా॥

కలుషసరిత్తరీ దనుజకుంజరకేసరి శ్రితలోకహృ
త్తరీ| యలఘు దయాఝరీ హతబలాంచదరి వి
పులోక్తిమాధురీ| సలలితచాతురీ కలితసచ్ఛరీ
రీ పరతత్త్వవైఖరీ| ఖలగజకేసరీ గుహాగుఖా ర
ఘునాయక దీనపోషకా॥౫॥

ఆగమసార చక్రధర యాదవవంశవరా ప
రాత్పరా| భాగవతాదరా వినత పాపహరా
జగదేకసుందరా| సాగరమందిరా సుగుణ సా
గర సేవక వజ్రపంజరా| రాగమదాంధ శిక్ష
ణపరా రఘునాయక దీనపోషకా॥౬॥

సేవకరక్షకా విమత సింధుమదక్షయకారి
సాయకా| భూవరనాయకా దురిత భూరుహ
పావక వట్పదాలకా| భావజరూపకా దివిజపా
లక యాశ్రిత మోక్షదాయకా| కావవె నన్ను
గోపకసఖా రఘునాయక దీనపోషకా॥౭॥

కదనకఠోర కామరిపుకార్ముక ఖండనస

త్యభాషణా। సదమలవాసవాది సుర సన్నుత
ఖండన దైత్యభీషణా। మదగజ సింహయాన
మణిమండన సింధుశయాన భక్తదై। న్యదళన
దక్షిణా వరగుణా రఘునాయక దీనపోషకా॥

మాధవరూప భావభవమానిత పత్త్రిరథే
శసంభవా। భూధవ కేశవా కుమతిభూధరవా
సవ శాంతభావనా। శ్రీధవ వాసుదేవ ఖలరా
క్షసశాత్రవ దేవ దేవ దే।వా ధరరాజధైర్య వి
భవా రఘునాయక దీనపోషకా॥౯॥

పావన కలాలాప పరపక్ష నివారక చాప
గోపకా। భావహరానులాప ఘనపంకజ బాంధ
వ వంశదీపకా। వావన సుప్రతాప పరితాపన
భీకరరూప సింధుతా। పావక కోప నిర్భర
కృపా రఘునాయక దీనపోషకా॥౧౦॥

నిరతము త్వత్పదాబ్జములు నెమ్మదిఁ బూను
పరాశరాత్మజున్। సురుచిర లీలఁ గొల్చెదను
సొంపమరన్ నినుఁ బ్రస్తుతింపఁగా। సరస కవి
త్వ వైఖరిని జక్కఁగ నా కొనఁ గూడఁ జేయు
మో। తరణి కులేశ భక్త వరదా రఘునాయక
దీనపోషకా॥౧౧॥

శ్రీవనితాశిరోమణికి సేవ యొనర్చినము సక

రించెదన్। భావమునందు సత్కృపులఁ బాయ
కనిల్పి భజింతు నాకుత్వ। త్పావన నామముల్
బలుకు భాగ్యమొసంగి యనుగ్రహింపు నా। నా
విధభక్తపాపహరణా రఘునాయకదీనపోషకా॥

ఏపగు చంపకోత్పలము లింపుగ నూఱాన
గూర్చిన వాని చే। నీపద నీరజాతముల నిండిన వే
డుకఁ బూజఁ జేసెదన్। బ్రాపుగఁ దావకీన కృ
ప భాసిల నంతయుఁ జిత్తగించు మ। న్నా పరప
క్షధైర్యహరణా రఘునాయక దీన పోషకా॥౧౩

రాకశశాంక చంద్రికల రాజితహారమరాళ
మల్లికా। స్తోకపటీరహీరముల దోపము నెంచు
సుకీర్తిసొంపరా। మా కమలాక్ష గైకొనుము
మానుగ నాదుకవిత్వ మాలికన్। నాకపురాధినా
థ శరణా రఘునాయక దీనపోషకా॥౧౪॥

నీరజగర్భుఁడున్ హరుఁడు నిర్జర లోక గు
రుండు శేషుఁడున్। బారము ముట్టఁ గాను నిను
భాసుర లీల నుతింప నేర్తురే। ధారణి లోపల
న్నరుల దారుణకర్మను వారి శక్యమే। నారద గీ
యమానచరణా రఘునాయక దీనపోషకా॥౧౫

ఆర్యయ మదీయ వాక్యనిచయంబులు తప్పు
లు గల్గి యుండినన్। వెరపుగ నీదు నామము ప

విత్రిత వానికొంగ దే ధరన్। పరగము సోఁకు
చో నినుము బంగరుచాయ వహించ కుంతునే।
నరసఖ దైత్యదర్ప హరణా రఘునాయక దీన
పోషకా॥౧౬॥

దురిత పయోధిలో మునిఁగి దుర్బలవై కడ
గానలే నిఁకన్। బరువడ లావకీన పదపంకజపో
తమునందు నిల్పి నీ। వరదుఁడఁ గర్ణధారకుఁడ
వై మది మోదము మీరఁ జేర్పు మీ। పరమ ప
దాఖ్యపారముగృపన్ రఘునాయక దీనపోషకా॥

అరికి భయంకరుండవును నబ్జభవాదులకుం
బ్రభుండవున్। సిరికి మనోహరుండవును సేవక
కోటుల కిష్టదుండవున్। కరికభిరక్షకుండవును గా
న పరేశుఁడ వీవె యంచు నే। దిరముగఁ జాటె
దన్ గుణనిధీ రఘునాయక దీన పోషకా॥౧౮॥

పేదకుఁ బెన్నిధానమును భిక్షునకింపగు నో
గిరంబును గా। పాదుగ నబ్బజేయు క్రియ భంస
రణాగ్నిఁ దపించుచున్నవా। శాదర మొప్పఁ దా
వక కథామృత మానఁగనిచ్చి తెంతయున్। నీద
య నేగణింపఁగలనే రఘునాయక దీనపోషకా॥

గిరిధరుఁ డంబుజోదరుఁడు కేశవుఁ డాహరి
విశ్వరూపుఁ డా। నరహరి రామచంద్రుఁ డల

నందసుతుండు విహంగవాహుఁడా। సిరిపతి నా
కు దైవమని చెచ్చెర నే నిను బ్రస్తుతించెదన్। న
ర వర పారిజాత హరణా రఘునాయక దీనపో
షకా ౨౦॥

ఓ కమలా మనోరమణ యో దనుజాంతక
యో మహారథా। యో కలిదోషవిధ్వంసన యో శ
రణాగత లోకరక్షకా। యో కరుణానిధీ వరద
యో పరమాత్మ మహాత్మ కావవే। యో కుజనప్రా
ణాశ హారి యో రఘునాయక దీనపోషకా॥ ౨౧

సుకృతనకబ్బినన్ విడిచి సుస్థిరతన్ సురదా
పు మాడ్కి పెం। పొదవ జనుల్ నినుం గొలువ
నొల్లక యన్యులఁ గొల్తురకటా। మదిని వరం
బు నే నెఱుఁగ మాధవ నాకభయంబొసంగవే।
సదయుఁడవై సముజ్జ్వలయశా రఘునాయకదీ
నపోషకా॥ ౨౨॥

దయ గలవాఁడవంచు మును దానవ రాజకు
మారకున్ గరిన్ రయమునఁ గాచి తంచు బుధ
రంజన శీలుఁడ వంచు నాశ్రిత। ప్రియుఁడ వటం
చు నీశరణు ప్రేమనుబొందితి భక్తవత్సలా। న
యమునఁ గారవించు కృప నన్ రఘునాయకదీ
నపోషకా॥ ౨౩॥

బంధుల నెల్లఁగన్గొని కృపాపరుఁడై నరుఁ డుండ వానికిన్। బొందుగ విశ్వరూపమును ముందుగ గీతలు చెప్పి చూపి యుం।పొందఁగఁ దద్భ్రమంబుడుపు నోజను మామక మానసంబులోఁ। జెందిన భ్రాంతిఁ బాపు వెస శ్రీరఘునాయక దీనపోషకా॥౨౮॥

అక్కట పెక్కు జన్మములయం దతిబాధలు పొందిపొంది నే। నెక్కడఁ బ్రాపు చాలకను హీనత నొంది యుపాయ మెంచుచున్। గ్రక్కున త్వత్పదాబ్జములు గంటి కృతార్థత నొందితి ననున్। మఱవఁ జేసి యేలికొనుమా రఘునాయక దీనపోషకా॥౨౯॥

పొల్లగు సంసృతిన్ బడలి ప్రోవ సమర్థులు గారటంచు నే। చిల్లరవారి రోసి వెసఁ జేరితి నిన్ శరణంబు గాఁగ నా। యుల్లమునందు నిల్పి కరుణోజ్జ్వల నన్ దయ మీఱ నేలుమీ। తల్లివి తండ్రి వీవె వరదా రఘునాయక దీనపోషకా॥౩౦॥

పక్కగ నిన్నెగొల్వవలె సౌఖ్యము నిచ్చిన నీవె యీవలెఁ। మక్కువ నీవె సేయవలె మానస మిచ్చిన నీవె యీవలెన్। చిక్కిన నీకె చిక్కవలె సేమము నిచ్చిన నీవె యీవలెన్। చిక్కులు

నేయు నేల హరి శ్రీరఘునాయక దీనపోషకా॥
రాముఁడు రాముఁడంచు మది రంజిలఁగా
భవదీయ నామమున్। బ్రేమము మీరఁ బల్కి
నను బెంపుగ మోక్షము నొందునే గదా। కా
మగవృత్తిఁ బాసి భువిఁ బంధముఁ బైననను వ్రా
యు మట్టినీనామము నామ నాల్క సుగుణా ర
ఘునాయక దీనపోషకా॥౨౮॥

రామ యితం బటంచు మదిరంజిలఁ బల్కినయా
యటన్నచో। సాధుఁగ మోక్షమబ్బునని సమ్మను
లం డ్రది నిక్కమౌఁ గదా। నీదయ నాదు భా
గ్య మిఁక నే జపియింతు త్వదీయ నామమున్।
మోదము మీరఁగా సతతమున్ రఘునాయక
దీనపోషకా॥౨౯॥

ఘోర భవాబ్ధినావ నరకోటుల సద్గతి త్రో
వ మస్తరా। పారని తాంత సాంద్ర తరపాపవ
నంబులఁ గాల్పఁ గీలి దుర్వార దురంత మోహ
తిమిర ప్రకరంబు నణంప హేళి। నీ తారకనామ
మెన్న వరదా రఘునాయక దీనపోషకా॥౩౦॥

కాలభట ప్రకంపనము గర్వితవైరివి నాశసా
ధనమున్। లాలిత వాగ్విభూషణము రాజిత ము
క్తి ఫలప్రదంబు ని। ర్మూలిత మోహమున్ గలి

త మోదముసై తగు నీదు నామమున్। జాల భ
జింతు నిర్మలయశా రఘునాయక దీనపోషకా॥
ఉమకును నందివాహనున కున్నతమంత్రి మ
హాల్యమున్ గజేంద్రునకు రక్షకంబునగు తా
వకనామము చాల సంతసంబమరంగ నాదు జి
హ్వా నిడి ప్రత్యహమ్మున్ వచియింపఁ జేసి దు
ర్భరమ మెడలింపవే గిరిధరా రఘునాయక దీ
నపోషకా॥౩౨॥
పావన రామ నామకమును భక్తిఁ బఠించిన
వారి పాదముల్। భావములోఁ దలంతు నటఁబా
రకుఁడంచుఁ గృతాంతుఁ డెంతయున్। సేవక
కోటికిన్ దెలియఁజెప్పు నటందురు పెద్ద లెన్న
నే। దైవముసాటి నీకు వరదా రఘునాయక దీ
నపోషకా॥ ౩౩ ॥
అంతమునందు భానుసుతుఁ డంపిన దూతలు
ఘోర రూపులై। చెంతను జేరు కాలమునఁ జిం
తయు రోగము హెచ్చుఁగాన నాకంతటనీదుసం
స్మరణ మబ్బునో యబ్బదో యిప్పుడే నినున్ సం
తతమున్ నుతింతు సుయశా రఘునాయక
దీన పోషకా॥ ౩౪ ॥
చెరకు రసంబు తేనెయును జున్నును చక్కె

రసానకంబునన్। బరతము గ్రావఁగోరిల హార
నీరజగర్భ నుతా రమేశ నీ। పేరువుగ నీదు నా
మసుధ వేసరు నానెద వాంఛదీర సు। స్థిర మతి
నాకొసంగు హరి శ్రీరఘునాయక దీనపోషకా॥

కోరెద నీకథామధువు గోరెద నీపదపద్మ
తోయముల్। గోరెద నీదునామసుధ కోరిక
వాచవి దీరునట్టుగాఁ। గోరెద భవ్య భాగవత
కోమల వాక్కుసుమంబు తేనరా। మాలలి
తాబ్జనేత్ర పరమా రఘునాయక దీనపోషకా॥

పరమపదేశ నిన్ను మదిఁ బాయక యుండి
నవారి కల్మషం। బరయఁగ మందరాద్రి పొడ
వైన రయంబునఁ బోదె ధూళియై। సరసత్వము
క్తికాంత తన చాదు కరాబ్జమునన్ గ్రహించదే।
నరహరి వారలన్ శుభగుణా రఘునాయక దీ
నపోషకా॥ ౩౭॥

తరణిసుతేశ వామనవి తలిమిమీఁగ నా
లకించి నన్నరసి వినాశసంభవ జరామయ భీ
తి విహీనమైన త్వచ్చరణ సరోజ యుగ్మ మణి
సౌధముఁ జేర్పవె దీనమానవో। తరుణ పవిత్ర
గాత్ర బిరుదా రఘునాయక దీనపోషకా॥ ౩౮॥

సంపదలన్ శరాతనయు సర్వ భయ క్షయ

మున్ సమిరజుం। డింపుగ మోహవారణము నె
వ్వడు లక్ష్మణుఁ డార్తినాశమున్। బెంపుగ నీ
దు నామమును బ్రీతిని మోక్షము నీవు గూర్చిన।
రక్షింపుము రయ్య భక్తులను శ్రీరఘునాయక దీ
నపోషకా॥ ౩౯॥

పోషణ సేయఁ దల్లి పితృభ్రాత హితంబుల
సంఘటించి ని। ర్దోషతఁ గూర్చి దండ్రి పతిము
స్తర విస్మృత మోహరోగమూర్చ। శేషము లేక
యంత నిరసింపఁగ వెజ్జవు కాచి యేలఁగా। శే
షివి నీవు దాసులకు శ్రీరఘునాయక దీనపోషకా॥

ఆజి భయంకరుండు వినతాదరుఁ డార్తిని
వారకుండు వి। భ్రాజిత సద్యశుండు నగు రామ
నరేంద్రుని సాటి దైవతం। బీజగమందు లేఁడను
చు నింపుగ బాహువులెత్తి పల్కెదన్। రాజి
త భక్తిచే సిరివరా రఘునాయక దీనపోషకా॥

ఉదయములోఁ బ్రపంచమిడి యున్నత లీలను
లోకజాలమున్। సదమల రీతిఁ బోషణము స
ల్పెదు వెప్పుడు సిదుపుత్రినన్। మదిఁ గనుఁ బ్రే
మ మీఱ బహుమాన పుర స్సరదృష్టిఁ జూచితర్వ।
హృదరముఁ జేర్చుకోమ్మ సుయశా రఘునాయక
దీనపోషకా॥ ౪౦॥

మునిజన మానసాబ్జముల మోదము మీఱ వ
సించు భృంగమా। యనయము గోసలేంద్రసు
తయారసి పెంచిన రాజకీరమా। ఘనరుచిమీఱ
నా నయనకైరవముల్ వికసింప నీముఖం। బను
నమృతాంశుఁ జూపవె దయన్ రఘునాయక
దీనపోషకా॥౮౩॥

సేవకులైనవారలను సేమము మీఱఁగ నేలి
నాఁడున। స్నేవిధినైనఁ బ్రోతువని యెంతయు న
మ్మితి నయ్య నీవు నా। భావమునందు వసించి భవ
బాధ నణంపక యుంటినాయనా। నావగఁ బా
పు వేగఁ గరుణన్ రఘునాయక దీనపోషకా॥

పాపముఁ బాపుమంటి నిఁక బాములఁ బెట్ట
కుమంటి దాపునుం। ప్రాపున నీవె యంటి నను
పాలనఁ జేయవె యంటి నాథుని। క్షేపము నీ
వె యంటి కడుసేమముగాఁ గృపఁ జూపుమంటి
నం। తాపము మాన్పుమంటి వరదా రఘునా
యక దీనపోషకా॥౮౫॥

మన్నన నేలుమంటి నినుమాని మఱెవ్వరిఁ
గొల్వ నంటి నా। యన్నవు నీవెయంటి నుకు
రంటఁగ హస్తము లెత్తి నీకు నే। సన్నుతిఁ జేతు
నంటి సురసన్నుత నీసరిదైవ మెక్కడన్। ది

న్నఁగ లేఁడటంటి సుమతీ రఘునాయక దీనపో
షకా॥౮౬॥

రసనకు నీదు నామసుధ రమ్యముగాఁగ నొ
సంగుమంటి నా। వీనుల వేడలించి త్వత్కథలు వి
నులనింపు నింపుమంటి నా। క్రొసరుల నీడఁ జేసి
మది కోరికె లెల్లను బాపుమంటి తా। మనమతిమా
న్యమంటి పరమా రఘునాయక దీనపోషకా॥౮౭॥

చిక్కితి నంటి నింక నను జిక్కులఁ బెట్టకు
మంటి నీకు నేఁ। దక్కితి నంటి త్వచ్చరణదాస్య
ము నా కొనఁగూర్పుమంటి నేఁ। మ్రొక్కితినంటి
నన్ను మది మోదము మీఱఁగ నేలుమంటి నిన్।
దిక్కని నమ్మియుంటి వరధీ రఘునాయక దీన
పోషకా॥౮౮॥

నిరతము నెట్టి వారలను నింద యొనర్చుచు
నుంటు వాణి యే। తరి భయ మొందఁ దెట్టి దురి
తంబులకున్ మన మేమి సేతు దు। స్తరము కృ
తాంతుదండనము తప్పదు ముందటిమార్గ మె
ట్టిదో। సిరివర నీవె నాకు గతి శ్రీరఘునాయక దీ
నపోషకా॥౮౯॥

పాతకదూర త్వత్కథలు పల్కవిసన్ మది
భక్తి లేసుగా। నీతికిఁ బాసి దుష్కథలు నిచ్చలు

క్షణ రాక్షసాంతకా। పరమపదేశ భక్త భవ
పాశవినాశ మురారి కేశవా। స్థిరమతి నాకొ
సంగు హరి శ్రీరఘునాయక దీనపోషకా ॥౫౪

నాకము నైనఁగోర నొకనాఁడును త్వత్పద భ
క్తిఁ గోరెదన్। నీ కరుణాసుధారసము నించినఁ
జాలు నొకింత నాపయిన్। భీకరకాలదూతలను
బంధమునంతు గణింతు మృత్యువున్। నాకిఁక నీ
పదిగు సుఖగా రఘునాయక దీనపోషకా ॥

కోరికెఁ గోరఁజేసి యతిఘోర భవాబ్ధిని
మగ్నశీలనా। భారము నీదె దేవ నను భక్తుల
సన్నిధిఁ జేర్పరాదె సం। సారము చాలు నోక్రు
పను సన్నుతి సేయఁగ బుద్ధినీఁగదే। సారసపత్ర
నేత్ర సుయశా రఘునాయక దీనపోషకా ॥౫౬॥

నీ పదధూళిచే శిలను నిర్మలరూపను జేసి
నావు ము। న్నాపద వాయ ద్రౌపదికి నక్షయ
వస్త్రము లిచ్చినావు నా। కోపిక లేదు తాపము
లనోందఁగఁ దవ్వులు నెంచి కావవే। తాపసవం
దితా సురనుతా రఘునాయక దీనపోషకా ॥౫౭

శ్యామలకోమలాంగ సురసన్నుత పాదస
రోజ పూర్ణభూషా। సోముని బోలు నీ మొగము
సొంపుఁ గనుంగవ దృష్టి మీరఁగాఁ బ్రేమ దలి

ర్వ నాకెప్పుడు పెంపుగఁ గన్గొను భాగ్య మబ్బు
నో। కామసమానరూప యనఘా రఘునాయక
దీనపోషకా॥౫౮॥

భాసురలీల ముజ్జగము పాలన సేసినఁ దృష్టి
పుట్టదా। యాసము నొందిఁ గూర్చు ధన మొంద
క రూకయుఁ గూడరాదటం। చాసలబాసి తావ
క పదాంబుజ దాస్య మొనర్పఁ జేరితిన్। దా
సికి నీవె దిక్కు వరదా రఘునాయక దీనపోషకా॥

ఎన్నఁడు నిన్ను నేమఱక నెన్నఁడు నాకిఁక
రేవ్వరేమటి। నన్నుమఱువ్వ రింక నను గావ
సమర్థులు నీవెగాక నీ। కన్నులఁజూడు నన్నెల
మిఁ గాఁబుని బాద్రఁ బసంగఁజాల నా। పన్నశర
ణ్య నిర్భర కృపా రఘునాయక దీనపోషకా॥

నీకథఁబలుకు పల్కులును నీకుపచారము సే
యు పాణులున్। నీ కడఁ బాయకుండు మది
నిన్నె కనుంగొనుచుండు దృష్టియున్। నీ కమనీ
య చర్యవిన విచ్చులఁ గోరెడు కర్ణ యుగ్మ
మున్। నాకొనఁగూర్పఁ గదయ్య కరుణా రఘు
నాయక దీనపోషకా॥౬౧॥

నందుని కాంతయందుఁ గరినాథునియందు
నహల్యయందునః। క్రిందనునందు దైత్యకులరా

జ తనూభవునందు ద్రౌపదీ। సుందరియందుఁ గ
ల్గు కృపసొంపుగ నింపుకమైన నాయెడన్। జెం
దఁగఁ జేయ వేమిటికి శ్రీరఘునాయక దీనపోషకా॥

మన్ననచేసి యేలుకొనుమా యనుమానము
మాని యీక్రియం। గన్నడ సేసి నేల కలకాల
ము నే శ్రమఁ జెందుచుండఁగా। నెన్నఁడు సౌ
ఖ్య మిచ్చెదిఁక నెన్నఁడు నన్ను ననుగ్రహించె
దో। యన్న మహానుభావ సదయా రఘునా
యక దీనపోషకా॥ ౭౩॥

నేరుపుమీఱ నాహితము నెమ్మది నారసి ని
న్ను వేడఁగా। నేరను నీవె యిమ్మెఱిఁగి నీమదికిం
తయు గోచరంబెకా। కారుణికాత్మ తత్తఱుణ
గల్గిన జాలునటంచు నిన్ను నేఁ। జేరితి నేమిచేసె
దవో శ్రీరఘునాయక దీనపోషకా॥ ౭౪॥

నిక్కము విన్నవించెదను నీరజలోచన భ
క్తపాలనా। యక్కఱతోడ ధనంబడుగ నన్యులఁ
జేరను మోక్షమిమ్మనన్। జక్కఁగ నీదు పాదాబ్జ
ములు సన్నుతి చేసెద దాస్యమిచ్చినన్। జిక్కఱ
లఁ బెట్టకేలు మిఁక శ్రీరఘునాయక దీనపోషకా॥

పాపముఁ బుణ్యమున్ భువన పావన నాదు
ధనంబు సర్వమున్। శ్రీపతి నీకు సమర్పణము చే

నెద నన్ గృపఁజూడు సంసృతిన్। దాపము
నొందలేను వెసఁ దావకదాస్యము నిమ్ము ప్రా
పుమఁ। దాపునునాకునీవె వరదా రఘునాయ
క దీనపోషకా॥౬౬॥

పలుమఱు రామ రామ హరి పన్నగశాయి
యటంచుఁ బిల్వఁగాఁ। బలుకవు రావదేమిటగఁ
బాపమతిన్ దయఁజేదో కోపమో। కలియుగవే
శరాఁదగదొ కల్మషవారిధి మున్గియున్న నేఁ। జ
లమున కెంతదాన సుయశా రఘునాయక దీ
నపోషకా॥౬౭॥

దాసిని గాని నీకు మునుదాసుల నెంతటిఁ
బ్రోచినావు నేఁ జేసిన నేరమేమి నినుజేరఁగరా
విడనీకు నాయపా। గాసికి నోర్వలేను మఱుఁగ
ల్గదె ప్రీతియొకింతమైన నా। యాసముఁ బాపి
యేలు సదయా రఘునాయక దీనపోషకా॥౬౮॥

పలుకులు తేనె లుట్టిపడఁ బల్కుచు నేఁటిఁ
గ్రూరచిత్తునై। మెఁరగుచు సూనృతం బనెడు మే
రకుఁ దప్పి భవాంబురాశిలోఁ। బలుమఱు మున్గి
తేలు నను బాయక తావక పాదపద్మమన్। గల
మన దాఁటఁజేయు మనఘా రఘునాయక దీన
పోషకా॥౬౯॥

చరణిని పామివంచుఁ గడు సమ్మతి దాసులఁ
గాతువంచు నా। యురు జఁ దీర్తువంచు నిఁక న
న్యుల వేఁడఁగ లేనటంచు నన్। సకలము బా
యనంచు మది నిన్నెడఁ బాయఁగఁజాలదంచు
నిన్। మరుగ వఁ జేరినాను పరమా రఘునాయక
దీనపోషకా॥ ౨౦॥

కలిత సరోజసూన వరకాముక కేతన శం
ఖచక్రలాం। గలముఖ రేఖలన్ విమల కాంతులఁ
బొల్చు భవత్పదాంబుజం। బెలమిని నయ్యహ
ల్యనెనయించి కృతార్థను జేసి తట్లనన్। జెలఁ
గి యనుగ్రహింపు దయ శ్రీరఘునాయక దీన
పోషకా। ౨౧॥

ఆన్నతకు బుద్ధిఁ జెప్పి సుఖమారడిఁ బో నవ
మాన మొందియున్। పన్న శరణ్యు యేలుమని భ
క్తి నినున్ వెసఁ జేర మ్రొక్కినన్। విన్నపమాల
కించి కడువింతగ లంకకు రాజుఁ జేయవే। పన్న
గ నవ్విభీషణుఁ గృపన్ రఘునాయక దీనపో
షకా॥ ౨౨॥

మకరము నగ్గజేంద్రుడును మానుగ ఘోర
రణం బొనర్చుచోఁ। ద్రిక్రమకఁ బొందినాగ మ
తిదీనత నిన్నుభజించ్చు నంతలోఁ। త్రికటచవంబు

నర్చబచి భాసుర చక్రముచేత నక్రమున్। విశల
ముగా వడిన్ దునుమవే రఘునాయక దీనపోషకా॥

మిక్కిలి లేమిఁ జిక్కి కలిమిన్ నిను వేడఁ గు
చేలుఁ డర్మిలిన్। జక్కఁగ నేగుదేరఁ గని సన్మతిఁ
బూజ యొనర్చి యుల్లియం। దక్కఁగ నిల్పి త
త్పృథుక తండులముల్ భుజియించి జన్నగ। ట్టి
క్కలఁ దీర్చినావు కదయా రఘునాయక దీన
పోషకా॥ ౭౪॥

కర్ణములన్ భవత్కథలు గ్రమ్మక యుండఁగ
మ్రోయఘంటలన్। పూర్ణముగా ధరించిన
యపుణ్యుని సద్గతిఁ జేర్చినావు నిన్। వర్ణనసే
యువారలకు వంచనయుంచుక యేనిఁ గల్గునే। యా
ర్ణవశాయి భక్త కదయా రఘునాయక దీన
పోషకా॥ ౭౫॥

పాయని మోహభారమునఁ జామరుఁడైన
యజామిళుండు దా। గాయము వాయు కాలమున
గట్టిగఁ బ్రాణ భయంబు నొంది నా। రాయణ
యంచుఁ బుత్రునను రాగమునన్ బిలువంగ ము
క్తికిన్। బాయిగఁ జేసినావు వరదా రఘునా
యక దీనపోషకా॥ ౭౬॥

చిరమృత పుత్రుకై గురుఁడు చెచ్చెరఁ దె

ష్మని పలుకఁ – నంతటన్। సురుచిరలీల వారినిధిఁ
జొచ్చి తదర్భకుఁడందు లేమిఁ జొ। ప్పరయుచు
నాశ్రితాంతు నిలయంబునకున్ వడి నేగి బాలు
సు। స్థిరమతిఁ దెచ్చియిచ్చితివి శ్రీరఘునాయక దీ
నపోషకా ॥ ౭౭ ॥

వాసిగ నంబరీష నరపాలుపైఁ గూల్పుమటం
చు నీర్ష్యఁదు। ర్వాసుఁడు కృత్త్రిఁ బంప నని వా
రితమైతగు చక్రిరాజమున్। భాసురలీల దాని న
డఁపన్ రయ మొప్పఁగఁ బంచి కృత్యపన్। దా
సునిఁ బ్రోచినావు వరదా రఘు నాయక దీన
పోషకా॥ ౭౮॥

సుధఁగొని దైత్యదానవులు పోఱుకుచు నేగిరి
మాఱు దిశకుఁ – త్వ। త్పదము లెయంచు దేవతలు
ప్రస్తుతి సేయ దయా పయోధివై। ముదమున
లోకముల్ బొదల మోహినివైతి మహాద్భుతం
బుగా। నదమలభక్తపాల సుయశా రఘు నా
యక దీనపోషకా॥ ౭౯ ॥

మోహినివైన నిన్నుఁగని మోహముమీఱ సు
ధా ఘటంబు మా। కో హరిణాక్షి పంచి యిడు
మెప్పుగనంచును దైత్యులీయఁగా। స్నేహము
మీఱ వేల్పులకుఁ బెచ్చెరఁ ద్రావఁగ నిచ్చియం

తలఁచి। శ్రీహరిమూర్తిఁ గైకొనవె శ్రీరఘునా
యక దీనపోషకా॥౨౦॥

భూసతిచేరి వేఁడ యదుభూపకులంబునఁ
గృష్ణమూర్తివై। భాసురలీలఁ బుట్టి యతిపాపప
రాత్ముని కంసదానవున్। వాసిరొసంగఁ ద్రుంచి
సురవైరుల నెల్లను బట్టిచంపవే। వాసవవర్ణనీ
యవిభవా రఘునాయక దీనపోషకా॥౨౧॥

భీకర మీనరూపమునఁ బెంపమరన్ జలరా
శిసోమకున్। దీకొని పోరి త్రుంచి యతిధీరతఁ
బ్రామినుకుల్ గ్రహించి యా। నాకసదుల్ ను
తింప నిజనందనుఁడైన విరించికీయవే। శ్రీకమ
నీయమూర్తిహరి శ్రీరఘునాయక దీనపోషకా॥

సురలును దానవుల్ గలసి సొంపుగ వారిధి
మందరాద్రిచేఁ। దరువుగ మూఁడులోకములు దై
న్యము నొందఁగఁ గొండ క్రుంగినన్। వెరవుగ
కూర్మమై గిరిని వీంతగ మీదికి నెత్తి వేల్పులన్।
హరివాయుఁ బ్రోచినావు సదయా రఘు నా
యక దీనపోషకా॥౨౩॥

నేరము మీఱమున్ గనక నేతుఁడు భూమి
హరించి నీరధిన్। జేరి వసింపఁగాఁ గినిసి చె
న్నలరార వరాహరూపమై। ధీరతఁ దానిఁ గూల్చి

ధరదీనతఁ బాయఁగఁ జేయవే దయన్ గా। కారు
ణికాత్మ ఫల్గుణసఖా రఘు నాయక దీనపోషకా॥

కరము హిరణ్యదానవుఁ డఖండ భవత్పద
పద్మదాస్యత। త్పరు నపరాధశూన్యు సుతు బా
ధనొనర్ప నృసింహమూర్తివై। బరువడి వానిఁ
దుంచి పరిపాలన సేయవె యాత్మభక్తుల। స్థి
రమతి నప్రమేయ హరి శ్రీరఘు నాయక దీన
పోషకా॥౮౫॥

వామను మేనుఁదాల్చి కడు వంచన మీఱ
డుగుల్ మహాబలిన్। భూమినివేఁడి పుచ్చుకొ
ని పొల్పుగనున్న మిన్నుముట్టి ను। త్రిమున
కిచ్చి దాతను చిరంబుగ భోగుల ప్రోల నిల్పవే।
క్షేమము వెల్లులొండ హరి శ్రీరఘునాయక దీన
పోషకా॥౮౬॥

పరశువుచే నశేష నరపాలకులన్ భృగురా
మమూర్తివై। యెరుకగఁ ద్రుంచి కశ్యపునకెల్ల
న గద్వర ధారవోసి యా। స్థిరవసియించచనం
చును ప్రతిజ్ఞ యొనర్చి ధరా నివాసమే। తక్రిని
దొలంగినావు వరదా రఘునాయక దీనపోషకా॥

దశరథ రామరూపమున ధారణిపై జనియిం
చి సత్యవా। క్స్వరుఁడగు తండ్రి యాజ్ఞవనవాటి

కంజోద్భవ వధూవిరోగదు। ర్దశను కృశించి రా
వణుని రాక్షసులఁ గమయించి జానకీ। శశిము
ఖిఁ దెచ్చినావు సుయశా రఘునాయక దీనపో
షకా॥౮౮॥

అసదృశ యాదవాన్వయమునందు లసద్బల
రామ మూర్తివై। పసులను గోపబాలకులఁ బాలన
సేయుచు రాజవేషులై। వసుధఁ జరించు దానవు
లఁ బల్వురవేమరు సంహరించి సం। తసమునుఁ
జెందినావు వరదా రఘునాయక దీనపోషకా॥

సుమహిత బుద్ధరూపమున శుద్ధతరంబయి
మించు స్వవ్రిసా। దమఖిలలోక భోగ్యముగఁ ద
ప్పక చేసి జనాళి కన్నదా। న మహిమఁ దెల్పుచుం
గరుణ నమ్రజనాళిని బ్రోవఁ బూరుషో। త్తమ
భువినుండవే సురనుతా రఘునాయక దీనపోషకా॥

కలియుగవేళ మానవులు గర్వితులై కులసం
కరంబుగా। మలినతనొంది భూసురుల మాన్యు
లదీనుల బాధపర్చఁగా। నలఘునిశాతశస్త్రమున
నా ఖలకోటుల నెల్లఁ గల్కివై। దళితులఁ జేతు
వీవె వరదా రఘునాయక దీనపోషకా॥౯౧॥

సలలిత మీన కూర్మతను సంయుత కోల నృ
సింహ హిగ్రిహా। జ్వల వర వామనాంగ ధర

భార్గవ రామ నరేంద్ర రామ శ్రీ। హలధర రామ నామ వినతాదర బౌద్ధ సురారిభీమ శ్రీ। కలికి రమాభిరామ యనఘా రఘునాయక దీనపోషకా.

తల్లియుఁ దండ్రియున్ గురుఁడు దైవము బంధులు నీవె యంచు నా। యుల్లమునందు నమ్మికొని యుండుటఁ జేసి యనేక రీతులన్। బల్లదముల్ వచించితిని రక్షక తప్పులు సైఁచి యేలు నే। విల్లరవారిఁ గొల్వనిక శ్రీ రఘునాయక దీనపోషకా॥ ౯౩ ॥

మది నెసుభద్రయందు నను మంజుగొడేకుల వర్ధనుండు శ్రీ। కదనుఁడు జగ్గరాయనికి సాధ్వికి జెల్లమకున్ తనూభవున్। ముదమునఁ జెప్పితిన్ శతకమున్ భవదంకితమై యొసంగఁ బెం। పొదవఁగఁ జిత్తగించు దయ నో రఘునాయక దీనపోషకా॥ ౯౪ ॥

గణ నియమాదికంబులు విశాలపుఁ బ్రాసలు శబ్దసంధులున్। ఘనవిరతిక్రమం బెఱుఁగ గౌరవమారఁగ భక్తవత్సలున్। జనువున దుష్కృతంబెడల సన్నుతిఁ జేసితి సత్కవీంద్రసజ్జన మణులార వేఁడెదను సత్కృతిగా సవరింపుఁడీకృతిన్॥ ౯౫ ॥

శుభమస్తు   అవిఘ్నమస్తు.

## శ్రీవేంకటేశ శతకములోని పద్యములు-

## STANZAS FROM SRI VENKATESA SATAKAMU.

శ్రీకరంబగు కృప చేతనకోటులఁ- గనికరంబె
దఁబూని కావఁ దలఁచి। వరశరణ్యార్యులు గన
ము రంజిల్లంగ- రామానుజుండన రహింవహించి।
పతితపావనుఁ డంచు శ్రిత కల్పతరువంచు- దేశి
కోత్తముఁడంచు దాసజలజ। భాస్కరుం డితఁ
డంచు భాసురవైష్ణవ- సాగర పూర్ణ శశాం
కుఁడంచు॥ జనులు నుతియింప ధాత్రిపై జనన
మొంది। నతజనావళి రక్షించినావు కరుణ। దురి
తభరనాశ వైశాఖపురనివేశ। వినుతగుణ శ్రీని
వాసేశ వేంకటేశ॥ ౧॥

మంగా మనఃపద్మ మహిత లసద్భృంగ- ము
నిజనసందోహ మోహనాంగ। సన్నుత సారం
గ సామగానాసంగ- భూనుత కరుణారసాను
షంగ। పాదసంభవ గంగ, పరమసుఖాపాంగ-
దేవారికులభంగ దివిజసంగ। భక్తదయా రంగ

పక్షిరాజతురంగ- విమలాంతరంగ శోభిత రథాం
గ॥ మారవిస్తీర్ణ తాప తమఃపతంగ। విమతసా
రసమాతంగ వెన్నదొంగ। దురితభరనాశ వైశా
ఖపురనివేశ। వినుతగుణ శ్రీనివాసేశ వేంకటేశ॥

క్లేశపాశ వినాశ కీశాధిపాధీశ- కల్మష దా
నవ కంఠపాశ। పట్టదవర కేశ కన్నతదాసేశ·
గోసుతా హృదయేశ గుణ నివేశ। లోకేశ లో
కేశ లోకదుష్కృతనాశ- భజితత కీనాశ భవు
నదేశ- తారహార పటీర దరశరతారేశ- హారో
పమిత కీర్తి పూరితాశ॥ రతిపతి సహస్ర సం
కాశ రఘునివేశ। మానినికరేశ రదజిత హూఘ్యు
కోశ। దురితభర నాశ వైశాఖ పురనివేశ। విను
తగుణ శ్రీనివాసేశ వేంకటేశ॥ ౩॥

దాక్షిణ్య విరహిత దైత్యలోక త్రాస- మా
నిమానస వాస శ్రీనివాస। కాంచన సుమనాస
కమనీయ దరహాస- పరహంసనాభ్యాస సుర వి
కాస। సౌమిత్రి సహవాస సాధుముఖోల్లాస-
మహనీయశార్ఙ్గ నామక శరాస। వైకుంఠ పు
రవాస వారిద సమభాస- సతత నత వ్యాస వి
తతదాస॥ చతురమ్బుధి వాగ్విలాస కాంచనసు
వాస। బంధుర తరాజవంజవ భయనిరాస। దు

రితభర నాశ వైశాఖపుర నివేశ। వినుతగుణ శ్రీ
నివాసేశ వేంకటేశ॥౪॥

భువనమోహనవేష భూసుర సంతోష- కౌ
స్తుభ మణిభూష కలిత భాష। కారుణ్యాపేక్ష
కామిత వ్రజమోష- భృగుమౌని శుశ్రూష వి
గతదోష। సురధునీసంభవచరణపద్మ విశేష- దే
వార్చకులదోష దీనపోష। సాగరపరిశోష సదమల
సంతోష- పరభక్తమానస పద్మపూష॥ సురజ
నోన్మేష నిర్జిత గురుమనీష। ముని మనస్తోష
సాదర వినత శేష। దురితభరనాశ వైశాఖపురని
వేశ। వినుత గుణ శ్రీనివాసేశ వేంకటేశ॥౫॥

హరిసూతి పోషణ హరిసూతిభూషణ- హ
రిసూతిభీషణ శర విహరణ। పుణ్య జన త్రాణ
పుణ్య జనక్షీణ- పుణ్య విచారణ పుణ్యచరణ। ధ
ర్మ సంరక్షణ ధర్మవిచక్షణ- ధర్మవిదారణ
ధర్మసుగుణ। శాంత సంభావణ శాంతవిలక్ష
ణ- శాంతవిహరణ శాంత శరణ॥ దురిత దూష
ణ దుర్మత దుష్టహరణ। సృష్టికారణ తాపస
సేవ్యచరణ। దురితభరనాశ వైశాఖ పురనివే
శ। వినుతగుణ శ్రీనివాసేశ వేంకటేశ॥౬॥

ఈరేడు లోకముల్ చారణగంధర్వ- యు

తుషిద్యాధరు లమరవరులు। సాత్యవతేయాది
సన్మునీశ్వరులును- నిఖిల సత్క్రతుభులును నిగమ
ములును। పద్మసంభవుఁడును భవుఁడును సురగ
ణ- గురుఁడును పన్నగవరుఁడు నైన। తసురీతిఁ
దావకస్తవము సేయఁగ లేరు- నాకువశంబౌనె
లోకవినుత॥ ఘోరసంసార బంధంబు జాఱిపోవ
మదికిఁ దోఁచిన నుతిఁ జేతు మదనజనక। దురితభ
రనాశ వైశాఖిపుర నివేశ। వినుతగుణ శ్రీనివా
సేశ వేంకటేశ॥౭॥

సరసిజంబుల మీఱు చరణాబ్జముల తీరు- ప
ల్లవంబుల నేలు పాణియుగము। పర్వేందుబింబం
బు పరిహసించును మోము- కలువ రేకుల మిం
చుకన్నుఁదోయి। బింబఫలంబును బెదరించు వా
తెర- నువ్వుపువ్వును లీల నవ్వు నాస। పంచేషు
ధనువును వంచించు కన్బొమల్- కనకపు తళు
కుల గదును చెక్కు॥ లంకమగు నీ నిజాకారమం
తనాదు। హృత్పటావేశమై యున్న దెల్లుమఱి
తు। దురితభరనాశ వైశాఖపురనివేశ। వినుతగు
ణ శ్రీనివాసేశ వేంకటేశ॥౮॥

ఘనతర దురితములే పనివడి గావింతు- స
ర్వాపరాధమునై సంచరింతు। నతిచంచలాత్మునై

యవివేకనైయుండు. బుధజనసేవకుబుద్ధిపారదు।
భవదీయ మృదు పదపద్మంబు లభింప. భక్తి
చాలదుగాని భావమందు। పెరుమాళ్ళపైనింతఁ
బ్రేమ లేదేమని. చింతింతు నొకవేళ చెన్నుదరి
గి॥ నీకుఁగృప యింత నాయందు రాకయున్న।
దాసురాలికి ముక్తి కాధార మేది। దురిత భర
నాశ వైశాఖపుర నివేశ। వినుతగుణ శ్రీనివాసే
శ వేంకటేశ॥౯॥

వరకరుణాకరా వంచన సేయంగ. నేనెంత
దానను నిమలాత్మ। నిగమసన్నుత నాకు నీభ
క్తిఁగృపచేసి. దుర్బుద్ధిఁదొలగించు దోషరహి
త। పాపవిమోచనా వోపిక చాలదు. భవబం
ధములకింక భక్తవరద। లోకేశ భవదాజ్ఞ లేకుం
డ వరింప. దాసికి శక్యమా తపనతేజ॥ నిక్క
ముగ నేర మున్నది నీవె దిక్కు। కాచి రక్షిం
చు నేఁడెంతఁ గరుణచేత। దురితభరనాశ వై
శాఖపురనివేశ।వినుతగుణశ్రీనివాసేశ వేంకటేశ॥

వర గోడేకుల వార్ధి పరిపూర్ణ చంద్రుం
డు. శ్రీరామదాసుఁ డాశ్రిత ప్రియుండు। ఖ్యా
తజగ్గారాయ తరుణి చెల్లమయను. కాంతామ
గర్భభజాత। మది నే సుఖదాక్ష్య ముద

మున శ్రీకరం- కందార్య దేశిక కలితచరణ। పంక
జ మకరంద పానభృంగము నాట- నిను బ్రస్తు
తించితి చనవుకతన॥ శతకమందున్న తప్పులు క్ష
మ యొనరించి। నీకృపాపాత్రిగా నేలు నీరజాక్ష।
దురిత భరనాశ వైశాఖపుర నివేశ। వినుత గు
ణ శ్రీనివాసేశ వేంకటేశ॥౧౧॥

సకల సత్కవిజన సంఘంబు గొనియాడి-
మనవి గావించెద వినయ మలర। గూఢార్థ
మెంతయు గోచరించదు నాకుఁ- బొలుపార ప
దసంధి బోధపడదు। నయమైన గణవర్ణ నియ
మంబు తెలుఁగను- యతిపద్ధతియుఁ బ్రాసగతి
యు నెఱుఁగ। కరివరదుని నుతి దురితహారంబని-
చేసితి నీకృతి చిత్తగించి॥ భక్తవత్సల నుతి గా
న భావమనక। కినుకఁ జెందక నాయెడఁ గృపయు
లర్ప। పరిహసించక నేరసులు బాసిపోవ। శాం
తమొనరించి దిద్దుఁడీ సాదరమున॥ దురిత భర
నాశ వైశాఖపురనివేశ। వినుతగుణ శ్రీనివాసే
శ వేంకటేశ॥౧౨॥



శ్రీరాములు.



# శ్రీ కేశవ శతకము.

# SRI KESAVA SATAKAMU.

శ్రీనలినాక్షు సన్నిభుని సేవకనీరజ లోక
బాంధవున్। భానుసమాన తేజు భవబంధవిమో
చనుఁ బద్మలోచనున్। ధీనిధి నస్మదీయ గురు ది
వ్యుని ద్రావిడ వేద వేదిరా। మానుజభాసురా
ఖ్య మని నంజలిఁ జేసి భజింతు కేశవా॥౧॥

కారణజన్మునిన్ దళితకర్మ్ముని దీనజనానుకం
పనున్। భూరి వివేకునిన్ సుజనపూజిత పాద
సరోజ యుగ్మునిన్। సార విచారునిన్ మధుర
సాదర భాషుని భక్తపోషణున్। ధీరశశాంకునిన్
వరద దేశికసత్తముఁ గొల్తు కేశవా॥౨॥

జనకజ తోడఁ గూడి యనిశంబును వాయుజ
భానుజాదులున్। బనివడి సోదరుల్ బుధులు
పార్థివ సత్తము లక్ష్మ దీక్షితుల్। వినయము
లొప్పఁ గొల్వఁగ నవీనవిలాస విశాఖ పట్టణం।
బున వసియించు రాఘవునిఁ బుణ్యు నినున్ భ
జియింతు కేశవా॥౩॥

కమలజు కన్నతల్లి నత కామఫలప్రద కల్పవ
ల్లి భూ। రమణుని పెన్నురంబనెడి రాజితసద్మ

మునందు నిచ్చలున్। బ్రమదము నొందు కల్మి
చెలి పంకజవైరి సహోదరీ మణిన్। సమర
స మొప్పఁగా మదిని సంతతమున్ వినుతింతు
కేశవా॥౪॥

దానవలోక మర్దనుని దండిబలంబున శాధి
పత్యమున్। బూనినమేటి కబ్జజ ఋభు ప్రభు ము
ఖ్య సమస్త నిర్జరుల్। మానుగ నగ్ర భాగమున
మన్నన నర్పవలిచ్చు నట్టిసే। నానికి విష్ణుహా
రికి దినంబు నమస్కృతిఁ జేతు కేశవా॥౫॥

పరమ తపోభిరాము గత పాతకనాశను లోక
పావనున్। సురుచిర యోగ భాగ్య చయ శోభి
తు మారవికార దూరునిన్। సరసిజలోచన ప్రి
తిము సాత్యవతేయుఁ బరాశరాత్మజున్। గురుత
ర తత్త్వసార నిధి గోరి సదా వినుతింతు కేశవా॥

నిరుపమ వేంకటేశ పదనీరజ లోలుని భక్త
వత్సలున్। వరకరుణాలవాలు పరవస్తు కులాం
బుధిపూర్ణ సోమునిన్। పరమరహస్యవేది క
విపాలన శాలిని సర్వవిద్యులన్। వెరవరి శ్రీని
వాసగురు వేమఱు నే మతియింతు కేశవా॥౭॥

పాలిత లిప్పఁగాఁ దనము హత్తర సద్గుణము
ల్ ద్రసజ్జులై। వేళ సిఖాంతరంబుల ప్రవిష్ఠయునై

విమతింప నేదవి। స్మాళియనందనర్చు నలిన ప్రి
భవాభుని పద్మనాభు గొం। గాళ్ళ సదన్వయా
బ్ధి మిహిరాకరుఁ జింతనఁజేతు కేశవా||౮||

రాగనివర్తనున్ విమలరాజిత కీర్తిని పుణ్య
మూర్తిగా నిన్। యోగవిచారుని న్వినుతయోగి స
మాన సమాధియుక్తునా। నాగమసార తత్త్వవి
దు నంచితసోదర లోలు నాకవి వ్యాగురు పా
ర్వతీశ్వర వదాన్యుని న్మదిఁదలంతు కేశవా||౯||

భూసుర మండనున్ కలితభూప వినోదని ర
తరహితస్వరున్। భాసుర సంస్కృతాంధ్రము
లఁ బ్రౌఢనచో నిభవాభిరాముని న్। దాసను
తోపకారకుని ధన్యచరిత్రుని సత్పవిత్రురా।
మేశను స్తుతిరాక్షరుని మిక్కిలి సన్నుతిఁజేతు కే
శవా||౧౦||

పన్నగ నార్యసత్తములఁ బ్రస్తుతిఁజేసి మ
హోన్న నీకునేఁ। జెన్నుగ నంకితంబుగ రచించె
ద వృత్తశతంబు నర్మిలిం। గన్నన చిత్తగించి త
నరార లసత్కృప నేలుమన్న యా। పన్న శర
ణ్య భవ్యగుణ పాతకనాశ రమేశ కేశవా||౧౧||

ఇష్టము లేనిచోట నొకఁ డుంచుక చెల్మి ఘటిం
చినంత వి। స్పష్టముగా మదింగలుగు బంధురమ

ర్మము దెల్పఁగూడునా। సుష్టుగ భార్గవుండు గు
రుపూతికి మంత్రి మొనంగి తానుబలి। కష్టము
నొందె శిష్యతతి గాసిలఁజూడఁడె తొల్లి కేశ
వా॥ ౧౨॥

మన్ననదప్పియున్నయెడ మక్కువగల్గిన వా
రసేనియుఁ। దిన్నగ మందలించినను తెల్లము
గా మదినొవ్వకుండునే। యన్నకు ధార్తరాష్ట్ర
నకునాదరమొప్ప హితోపదేశము। లెన్నఁగఁజే
సి యా విదురుఁడేమి ఫలంబును జెందె కేశ
వా॥ ౧౩॥

సురుచిర సంపదుత్కరము సుందర గాత్రము
గల్గియున్న బలె। దురుసునె తోడఁబుట్టువుల దు
ర్మతి గాసి యొనర్చకుండునే। యెరవుగ శీత
భానుఁడు సహోదరియైన రమానివాసవున్। సి
రులు హరింపఁడేమదిని సిబ్బితి యింతయు లేక
కేశవా॥ ౧౪॥

చతురత సద్వివేకమును సజ్జనగోష్ఠియు రా
జదర్శనం। బతిరతి నబ్బఁజేసిన యనర్హుఁడు
తండ్రికిఁగీడు సేయుమున్। హితవుగఁగంస భూ
పతి యొంచుక గొంకక యుగ్రసేనునిం। బ్రి
తముగఁగారయింటఁ బగవారలు నవ్వఁగ నుం

చెం గేశవా॥౧౫॥

అతిథి మనోహరంబునగునట్టి పదార్థము మొ
సంగలేక పాన్పుతుండగు దాత నిపుణ ములనూన
ముగానిడ నిష్ఫలంబగున్। హీనమురక్తియుధా
ర్తునకు నెంతయుం బాపులనీను గంధమా। యతి
తకృపమైన నలంద ముద మందునె యాకలిం బాసి
కేశవా॥౧౬॥

ప్రాకటలీల నాప్తులను బాసి మనోవ్యథం జెం
దువానికిన్। నాకములభ్యమైన నొకనాండును సౌ
ఖ్యమునొంద నేర్చునే। శ్రీకర పద్రసాన్నమును
చెల్వొదలిక్షుంగ నారగించినన్। తేకువ వారిగో
లకయ తృప్తివహించునె ప్రాణి కేశవా॥౧౭॥

నిలయము దిద్ది తీర్చుటకు నేర్పు చాలనివా
రి నుంచినన్। జలువుగ తిన్నవేశనము భాసిలనే
రదు మెవ్విధంబునన్। నలువుగ దోహదక్రియ
లొనర్పంగనేరని వారిరక్షచే। ఫలితఫలద్రుపుష్ప
లతికాతతి గాంచునె సొంపు కేశవా॥౧౮॥

తులువలు సాధుగంథమును దుర్నయవృత్తి
గ నెగ్గులాడినన్। గలుగంగ నేల తచ్చరితకల్మష
మొందఁగ నేరదెట్లనన్। గలయఁగం ద్రొక్కి
పైరిభము కర్దమమూన్ గెరలించి పోయినన్।

గలితతటాక పూర్ణయగు గంగ పవిత్రియ కా
దె కేశవా॥౧౯॥

దిటముగ తేమిఁ దెల్పుచును దీసతతోఁ బ్రతి
మాలుకొన్న హా। శఠిమన కించుకైనఁ గని కార
ముపుట్ట దదెట్లకో యనన్। ఒటువగు రాతిబొమ్మ
తన పాదములం బడి వేఁడుకొన్నను। న్నటువలె
నుండు దానికి దయారసమేగతిఁ గల్గు కేశవా॥

ఎలమిని బుద్ధిదెల్పినను హీనుఁ డసహ్యము
నొంది మిక్కిలిన్। చలము దలిర్ప వానికి నశ
క్యపు కీడొనరించ దుండునే। చెలిమిగ నవ్విభీష
ణుఁడు సీతను రామున కిమ్మటన్నఁ డాఁ। బలు
వుగనల్గి రావణుఁడు పారఁగఁదోలఁడె వాని కేశవా॥

సగసుని వాక్సుధారసము పారవిచారముగ
ల్గు వానికిన్। శరము రుచించుఁ గాని యది గా
ఢ పుమూర్ఖునకున్ రుచించునే। నిరుపమ గా
న మాధురికి నెమ్మదిఁ జొక్కు ఫణీంద్రు రీతిని।
ధరణిని దుందుభాములు ముదంబును జెందునె
యెంతు కేశవా॥౨౨॥

అవసరమున్న వేళఁ బ్రభు వల్పుని పేరు వ
చించి నంతనే। వివరము లేక వాఁడు తనవిందుచి
ముట్టుచు నిల్గు వెట్లనన్। జవమున వేఁటలోపల

ను జాగిలము వ్రాఁగయుండు బిల్వను। త్స్పవము
న దూరయాన జనితశ్రమ మూననిరీతిఁ గేశవా॥

ఘనతరమైన లోభమునఁ గాసును వీసము
నీయఁ జాలకన్। పనివడి ఘాతలాడి తన బంధు
లనఁగా వెతసేయు దుర్జనుం। డనయము పాం
డవేయులకు హస్తిపురాధిపుఁ డెగ్గుసేయుటల్।
ధనమును గూర్చికాదె మురదానవదర్ప వినాశ
కేశవా॥౨౪॥

ముష్కరుఁ డెందునైన తన మోసము దోవ
మెఱుంగలేకయు। న్నిష్కరసమృద్ధి నొంది కడు
నేర్పున వంచనసేయు నాప్తులన్। శుష్కమనీ
షుఁడై మధువుఁ జొక్కఁచుఁ గ్రోలి మదించి మి
త్త్రిలన్। నిష్కరుణాతిరేకమున నిర్దయ మర్ద
నసేయు కేశవా॥౨౫॥

నిస్తుల సుచరిత్రాచరణ నిష్ఠగలట్టి వధూటితో
టివ్య। ధ్వస్తపునీతులం జరపునట్టి దురాత్ముని జెం
డుహాని వి। ధ్వస్తముగాదు భూసుతను రావణుఁ
డెంతయుఁ దూలనాడి తాఁ। బ్రస్తుతమందుఁ దత్ఫ
లము పాశకటీల భజించె కేశవా॥౨౬॥

కనఖాను బొంది పలుకఁజాడఁ గల్మష దూరు
ని కిల్బిషాత్మునిన్। ఘనతర శేముషీయుతుఁడు

గ్రక్కున నిర్ణయ మాచరించుఁడా। ఘనమున
నాకారరూపమున వర్తిలు వాయస కోకిలంబు
లన్। ధ్వనివిని నంతలోనె గుణవంతుఁడు పో
ల్చిన రీతిఁ గేశవా॥ ౨౭॥

నరపతి నీతి దెల్పుమని నన్ గుణ హీనుఁడు
దెల్పఁ బోపునే। సరస గుణప్రపూర్ణుఁ డది సయ్య
నఁ దేటగఁ దెల్పునట్లుగా। సొరది గ లోష్టమందుఁ
గనఁ జొప్పడునే ముఖశోభ యేర్పడన్। సురు
చిర దర్పణంబునను జూడఁ గనంబడు మాడ్కిఁ
గేశవా॥ ౨౮॥

మృదువగు భాష నోతరము మిక్కిలిగా
శ్రవణ ప్రియంబు దు। ర్మదపరుషోక్తిజాలము
నిరాదరమై తగు సజ్జనాళికిన్। సదమల కోకిల
స్వనము సమ్మతితో విననిష్ట మొనగన్। వదికిని
వాయసధ్వనివినందగియుండునె యెందు కేశవా॥

నరహరి భక్తిలేని నరనాథుని పుణ్యము శ్రీ
విలాసమున్। సరసత సర్వవిద్యలును శాంతివి
హారము నిష్ఫలంబగున్। సరసున దంత ధావన
ము సల్పకనే యుపవాసమున్నది ను। స్థిరముగ
సువ్రతం బలరఁ జేసిన చందమునొందు కేశవా॥

చల్లని రాఘవ ప్రభుని సన్నుతి ముక్తిఫలప్ర

దాఁచియుఁగా। చిల్లర దేవతాభజన చెన్నుగ నో
త్తమొసంగఁ జింపు సం। ధిల్ల ధనాఢ్యమాని క
డు దీనత వేఁడ దరిద్రు లిత్తురే। కొల్లగ వాంఛి
తార్థమును గోపవధూ హృదయేశ కేశవా॥

రసికుఁ డెఱుంగు నారసికరాజ శిఖామణి మ
ర్మకర్మముం। బెసఁగఁగ ముక్తరాధముఁడు
నించుకయేని గ్రహింపనోపునా। పసగల పద్మ
గంధమును బంభరమానఁగ నేర్చినట్లు కం। తస
మున దర్దురం బెఱుఁగునా సహవాసము గ
ల్గి కేశవా॥౩౬॥

ఘనమగు లేమిచే నొగిలి కాపును ప్రాపును
లేకదీనతన్। ధనబల దుర్మదాంధునకు దాస్యమొ
నర్చినవాఁడు వారలన్। కనలునఁగీడు సేయును
విశంబులు వీడముఁ జేరి యాశ్రయిం। చినఁగని కా
కముల్ బెదరుజెందఁగఁ దన్నునుగాదె కేశవా॥

కార్యవశంబుచేత నపకారిని ధీయుతుఁడైన
వాఁడు సౌ। కర్యముగాను దెల్పినను కాని ప్ర
యోజనమౌను నీచమే। యార్యులు మెచ్చు చం
దమున నానక దుంకుభి నేర్పు మీఱఁగా। భార్య
ను వర్తిలిన్ మృతికిఁ బాపఁడె కంసుని వేఁడి
కేశవా॥౩౮॥

అవసర సక్తుఁడైన నృపుఁడల్ప కులోద్భవులై
నవారిఁ బ్రాభవమునఁ జెల్మి చేసినను వంచన
గాదది మంచి సేయగున్। రవికుల వార్ధిచంద్రుఁ
డగు రాముఁడు రావణ నాశ నార్థమై। ప్లవ
గుల తోడ మైత్రి ననపాయతఁ జేసెను గాదె
కేశవా॥ ౩౫॥

కరము మనంబులోఁ బ్రియము గల్గిన నెచ్చ
టనున్న నేస్తముల్। నిరతము సఖ్యముల్ విడు
వనేరవు నీరజముల్ దివాకరుం। దరమరలేక దూ
రముల యందు వసించియు నుల్లసిల్లుచున్। మ
రువక చెల్మి సల్పు గతి మా రమణీ హృదయేశ
కేశవా॥ ౩౬॥

యత్నము సేయ నెంత పని కైనఁ బ్రయోజ
కుఁడైనవాఁడు స। ద్రత్నమువంటి కార్యమును ర
మ్యముగా సమకూర్చు నాతఁడున్। నూత్నము
గాఁగ వారిధి నమానజవంబున దాఁటి యంగనా
రత్నముఁ గాంచి వాయుజుఁడు రామునకీయఁ
డె వాతఁ కేశవా॥ ౩౭॥

భగ్నమనస్కుఁడై జనుఁడు భావిశుభార్థ
ము వైష్ణవార్థము। ద్విగ్నత గొన్న నొర్లి యం
త వేయు భవంబులఁ బోదు పాపముల్। మగ్న

ము నొందఁజేయు నను నానుగ మీఁట నంచు
వెట్టితాఁ। దగ్ధపటంబునన్ ముడిచినట్లుగ దా
నవనాశ కేశవా॥౩౮॥

తరుణి కాయుక్తి నమ్మి పతి దండన సేయుఁగ
దాను యెఱుఁగక। పరగఁగ రాజరాజనరపాలుఁడు
చిత్రశరీరి పల్కుతే। తిరముగ నెంచి పుత్రకుని
ధీరవిచారుఁ గుణగంభీరునిన్। కరపదహీనుఁ జే
సి కులకాలము దుర్యశమొందె కేశవా॥౩౯॥

స్త్రీకడ సత్య వర్తనఁ జరించుచుఁ గోరుక
లొసఁగ భర్తదా। లోక విరోధియాను తుది
రూఢిగఁ బ్రాణముఁ గోలుపోయెడిన్। కైక వ
రంబు గాదనక కానకు రామునిఁ బంపి సుత్వ
రన్। నాకముఁ జెందెఁ బంక్తిరథనాముఁడు శో
కముచేతఁ గేశవా॥౪౦॥

చెంగటి వారలు న్యాగవ నిర్మితి శీలము దక్క
యున్నజా। రాంగన వస్తుసంచయము నన్యుల
కిచ్చును బోర్పుమంచుఁ దా। న్మంగల వెనక బం
ధువులు మూగి విలాపమొనర్చ దుర్జనుం। డంగ
ముఁ బాయుచోఁ బరుల కర్థము వ్యర్థముసే
యుఁ గేశవా॥౪౧॥

లేక బుద్ధి వానికి నన్యవశంబునఁ గల్గి గ

గ్గినఁ । మూలఁగ నాకు సజ్జనుల దోషము లెం
చుచు మాటిమాటికిన్ । చాలఁగఁ గుర్కురంబున
కు మఘ్రిప భోజన మిచ్చి పెంచినన్ । దాలిమి
దక్కియున్ మొఱుఁగు దంతిచయంబును జూచి
కేశవా ॥ ౮౨ ॥

బలియుని నాశ్రయించినను బౌరుష హీనత
లేమ దన్యముల్ । గలిగిన లేశ పోయినను గష్ట
పు నీచుని ప్రాపు మానఁగున్ । జెలువగు నా
మ్రమాకిని వసించిన మెత్తురు తాళభూజవా । టి
ల వసియించు నాతఁ డెపుడుంగడు నిందకుఁడు
గాఁడె కేశవా ॥ ౮౩ ॥

కలిమి గలట్టి కాలమున గ్రక్కునఁ బొమ్మనఁ
జేరవత్తురా । కలిమి వినాశకాలమున గ్రక్కున
దమ్మనఁ బాసిపోదురు । జ్వలముగ భూమిభర్తకొచ
ను జాడల పేత్రము లాడఁగా జనుల్ । పొలుపు
గఁ జూడ నోపుదురు పూర్ణ దురాగ్రహ మెత్తి
యాతఁడే । బలమునఁ దోఁపఁ బోయినను పార
రె భీతిలి వారు కేశవా ॥ ౮౪ ॥

చనువు బలంబునుం గలుగు సాధులు గొంద
ఱ మూలభృత్యులన్ । ధనము నొసంగలేక వసు
ధాపతి పొమ్మనఁ గార్యహానియౌ । ఘనతర భా

రమోర్వశకు ఘంటముఁబట్టుటనూని యాకులం।
గొన కొని గ్రంథ మేగతిని కోవిదుఁడైనను వ్రా
యుఁ గేశవా॥౭౫॥

సర్వవిశేష కార్యవిద మన్నపు దోషము
గాంచి కిన్కచే। గర్వనుమీఱఁగా విభుఁడు క
న్నులఁ జేసినఁ దానె గాసి యౌ। గుర్వనిషా
క శాకునుఁ బక్షులంటిత లేఁ బరాభవించి తాఁ।
బూర్వము ఘోరదానవులు పోరికిరా భయ
మందెఁ గేశవా॥౭౬॥

ఒకఁడె చాలు తల్లికి గుణోజ్జ్వలుఁడౌ సు
తుఁ డింపొనర్పఁగా। ఠకరును లట్టి వారసు దు
రాత్ము లనేకులు పుట్ట నేటికిన్। చొక్కపుమా
ఘ్ర్యమాల సికఁజుట్టినఁ దావియు సోయగంబగున్।
చిగుర ని ఘాసపుష్పములచేరులు వేయును నేఁ
గేశవా॥౭౭॥

పలినవాని సన్నిధిని హృద్యముగా సకలో
పచారముల్। తాలిమితో ఘటించు నొక దా
సుఁడె చాలును రెండతేల భూ। పాలుని కాలి
వ్రేలి నొక బంగరురత్నపు మట్టెఁ బూనఁగా।
జాల వికాస మూను పని సత్తువి యిత్తడి వేలఁ
గేశవా॥౭౮॥

కరము దురాత్ములైన చెలికాండ్రు వచించి
నలీల కార్యముల్ । జరిపిన రాజు మోసపడు స
ద్వినయంబున దుస్ససేనుఁడున్ । మఱువక కర్ణ
సౌబలులు మాటలచేతనె కౌరవేశ్వరుఁ । జెరి
పిరి పాండుపుత్రులకు సిద్ధవిరోధిని జేసి కేశవా॥

తనయులు సోదరుల్ సఖులు తల్లి పితామ
హుఁడాదిబంధువుల్ । జనని పురాకృతంబున
ను శత్రుఁడైనను నిందకహర్ముఁతే। ఘనముగ భ
త్యరాజిఁగొని గర్భముతొబ్బువహించు నాతఁ
డున్ । మునుతను దిన్నవస్తువుల మూల్గుచుఁదిట్టి
నయట్లు కేశవా॥౫౦॥

పూనిక మీరఁ దీవ్రముగఁ బొల్పుగ నర్థికిఁ
గూర్చిరుఁ డెంతయున్ । మానుగ నర్థమిచ్చి పలు
మాఱును జింతిలు దీనవస్త్రుఁడై। స్నానము చే
సి చేసియును శ్మశ్రుద మొప్పఁగ సత్వరంబుగా।
నేనుఁగు పాంసు జాలమున హీనత బ్రుంగిన
భంగిఁ గేశవా॥౫౧॥

వరగుణుఁడైనఁగాని నరపాల శిఖామణి
యైనఁగాని యున్ । హరికృప లేకయున్నఁగతి న
ల్ప సమాజముతోటి వాఁడగున్ । అరయఁగనే
క చక్రపురమందున ధీయుతులైన పాండవుల్ ।

తిరిపెము దండి రేపురుమ దీసుఁకొపడి దస్సి
కేశవా॥౫౨॥

వగగుణ నీకునొక్కతఁటి వందన సేయుకలం
పు పుట్టిరన్। బరులకు భృత్యులై జనలు పొరు
పహీనత నొందకుందురే। పరమవిరాజమాను
లగు పాంచకుమారకు లావిరాటునిం। దిగము
గ నొక్కయేఁడు కడు దీనతఁ గొల్వరె తొల్లి
కేశవా॥౫౩॥

సంతసమొప్పఁగాఁ గుమతి సాధ్వినెలుం
గెల మానసంబు న। త్యంత పరాభవంబునను
దాప మొనర్చినపాపిఁ బొందు మున్। దంతిపురా
ధినాయకుఁడు ద్రౌపది వస్త్రవితానహారియై।
యెంతయు నిందఁబొందె మదినేమివికాసముఁ
జెందెఁ గేశవా॥౫౪॥

అలసటఁ జెందియైనఁ గడునొప్పఁ బలుంపు విశి
ష్ట కార్యమున్। సలువఁగ నోపునే ఘనుఁడు కష్ట
ద మొప్పఁగఁ దీర్చు శర్వుస। ల్లలిత శరాసనంబు
గని రాజులు మోపిడలేక పోవఁగాఁ। జెలువుగ
రాఘవేశ్వరుఁడు శీఘ్రమె రొక్కడి త్రుంచెఁ
గేశవా॥౫౫॥

కుదేని వృథంబులేని యనుమాన మనుష్య

రిన్। నేరుపు చాల జెన్నఁటికి నిర్జరవైరివినా
శ కేశవా.౫౯॥

చోరవగ నిష్ఠితార్థము త్రిశుద్ధిగఁ గోరు
మనీష యేరికిన్। ఉరుగుసై యెన్ని భంగులను ది
ట్టముగాఁ జమడెంచు నీరసుస్। స్థిరముగ ని
మ్న దేశమునఁ జేరకయుండఁగ నిల్వనేర్చునే। క
ర్షముబలంబు నైపుణము గల్గినవాని కైన కేశవా॥

ఇష్టక మాడ నేర్చినను హెచ్చుగఁ గొండె
ముఁ జెప్ప నేర్చినన్। మచ్చిక మీఱ వారికిని మా
డలు చీరలు సొమ్ములిత్తురో। నచ్చుగ నాటకంబున
దయారస మొల్కఁగ సత్యపూర్వకిన్। మెచ్చి
బహూకరించి చెలిమిన్ గదుఁ బ్రీతి యొనర్చు
కేశవా.౬౧॥

సంపదతే గతంబనుచు చల్లగఫుల్లగ వెట్టివా
రలన్। సొంపెడ లంగనాడుఁ గడుచుల్కనిమా
నిసి వాని నైజమే। యింపుగ గన్మగంబు జనియిం
పఁగ గారుఁడు మాటి మాటికా। రంజముఁ బట్టి
కోయుఁగద రాజిలు దారువునైనఁ గేశవా॥౬౨

ఘనులఁ దిరస్కరించి జనకంటకు లాడినదు
ష్ప్రలాపముల్। పనివడి తత్ప్రలాపకుల బాధ
నొనర్చి నశింపఁజేయు సూ। ర్యునిపయి నుత్త

ర్పఁ బ్రతిజ్ఞ జయద్రథుణ మహాహవా। వాడు
లు ద్రోణభీష్ములును ధైర్యసమర్థులు కర్ణశల్యు
లున్। బోరఁగ వారిఁ గైకొనక పొంగఁ ద్రుంచె
కిరీటి కేశవా॥ ౭౪॥

పండుగనైన సన్నిహిత బంధులఁ జీరక దు
ర్నయుండు తా। నొండొకవారి స్తలపి యుత్స
వ మొప్పఁగఁ జేయు నెట్లనఁ। గింశుకపుష్పంబుతో
ష్పుకుల నిర్ణయస్పర్తిఁ బంప మానివే। ఆఁ
డొక వర్ణ కృత్యముఁ నొందిన పోలిక గాదె
కేశవా॥ ౭౫॥

చెలిమియొ బాంధవంబునకుఁ జెన్నగు హెచ్చు
గుఁ జూపి నూచినన్। గలఁగక పాండుసూనులను
గానకుఁ బంపఁ డెయాంచి కేగుఁడ। య్యలసుబుఁ
బాయకోపక ధరానుపలబ్ధి వ్యాసశాబ్దము
ల్। కలితసుఖంబులన్వదలి గ్రుక్కిన వెంబడిపో
రె కేశవా॥ ౭౬॥

ధనపతి గాకయుండిన యుదారప్రసిద్ధులనే
రకుండినన్। కుశమణిమైన మానవులఁ గొప్ప
గఁ జూతురు కోవిదోత్తముల్। ఘనతరభూరుహం
బులఁ గ్లిన సత్తు సేసరు పూరిఁ స నెలసిఁ జేసి
పూజలనుసల్పుచునుందురు గాదె కేశవా॥ ౭౭॥

ముగా గృహంబులను భాసిలు నేవరిశుద్ధి కేశవా।

అతిశయ భాగ్యవంతుఁ డగునట్టి తటిన్ ఖ
లుఁ డెగ్గొనర్చు ని। గ్గతధనుఁడైన కాలమున గౌ
రవ భావముతోడ వర్తిలున్। ప్రతిదిన మగ్ని
వేసవులఁ బర్వత కాననముల్ దహించు నా।
క్షితఁదగి వానకాలమున సౌఖ్యమొనర్చునతండె
కేశవా॥౮౨॥

అకుటిలులౌ భవార్తుల దయారసమొప్పఁ
గఁ బ్రోచుచుందువే। మకరము చేతఁ జిక్కి కరి
నాథవ నన్న్యపగావవే యనన్। ప్రకటముగా
సురల్ బొగడ భాసుర చక్రము చేత నక్రమున్।
శకలములై పడం దునిమి సయ్యనఁ గావవె ము
న్న కేశవా॥౮౩॥

క్రూరుఁడ కీచకాధముఁ డిడఁ గూడద దేగతి
నమ్ముఁ గొల్చెదన్। జేరి వృకోదరుం డమున్న తనచే
యొరు మస్తకమంటి దీర్చనన్। బోరున వ్రీలఁ
పైపడ శివున్ గని వేఁడిన యట్లనావనన్। దా
రున నమ్మహాత్ము తలఁ దాఁకఁ బోవఁడె చేయి
కేశవా॥౮౪॥

చిన్నని బుద్ధిలేని కడు దీనునిఁ బ్రోచెనఁ గ
ర్భిణంబునన్। కొన్నన చార్యవతినాఁడుఁ డు కాల

వశంబున లేమిఁ జెంది యా। పన్నతపొందఁగా
ది జనపాలుఁడు బత్తెము రెండుపూటలున్। జె
న్నగవచ్చి బోవ్రిపి భువిఁ జెందుమగదా యపకీర్తి
కేశవా॥౭౫॥

మృదు మధురంబుగాఁ బలుక మిక్కిలిగర్వ
మునొందు దుర్జనుం। డొడెఁగి చరించుచుండుఁ
బరుషోక్తుల ధర్జన మాచరింపఁగా। వదులుగనా
రి గూచిననను వంగు నవిల్లు బలం బెఱ్వఁగాఁ।
గుదురుగఁ బూన్కితో గొటగ గూర్చఁగ నేచిన
నఁ గాని కేశవా॥౭౬॥

మచ్చిక నచ్చటం గలుగు మార్గ మెఱుంగక
నెట్టిచోటికిన్। జెచ్చెరఁ బోడఁ బోయినను సి
ద్ధిని నొందు సుయోధనుండు తా। హెచ్చగ
ధర్మరాజు సభ కేగి జలంబులమున్గి భూమిపై।
వచ్చగ మోకరిల్లఁ బడి హాస్య రసాస్పదుఁడ
య్యెఁ గేశవా॥౭౭॥

ఎంతధనంబు గల్గిన నదెంత వివేకము గల్గి
యుండినన్। సంతత దుష్టబుద్ధియగు వాన లభిం
చనవాఁడమోఘుఁడౌ। శాంతియు దాంతియుం
గృపయు సత్యజవిత్వముగల్గి మిత్రుఁత। స్వాంతము
డు మంత్రియైన జనవల్లభు డందును నొందు

కేశవా॥౮౮॥

బహుతర గర్వమొందినను బాధకరంబగు నె
ట్టివారికిన్। సహనము లేక ధాత దను సర్వజగత్ప్ర
భుసంస్తుతుఁ బల్కఁగా। విహితము మీర వాణి ప
దివేల విధంబుల స్తోత్రి చెప్పఁగా। దహనుని బో
లి వేంకట్రిమునఁ దప్పరిఁ బాసి చరించె కేశవా॥

పూరిత సద్గుణంబు గలుగఁ బొందె దొకప్పు
డు సాధువైననిన్। స్వైరముగా వచించినను శాం
తవివేకవిహీనుఁగా దురా। చారుఁగ నెంచరా ద
తని పార సుధారస మొల్కఁ బల్కినన్। తీవ
రముగ గర్వవానికి నికీడు దలంచుటమేలె కేశవా॥

సంతత దుష్టచిత్తునికి సద్గుణ మొకొకటైన వే
ళఁ గల్గినన్। దొంతర చెల్మిఁ జేసినను దుర్గు
ణ మితఁడు మానెనంచు నా। వంతయు నమ్మరా
దతని నంచితమైన భుజంగరాజమున్। జెంత
కుఁ జేర్చఁగా జనుని క్షిప్రము గర్వశ యున్న
కేశవా॥౯౧॥

అనయము శత్రువై తిరిగి యక్కఱవచ్చిన
వేళ నెమ్మిగా। వెనరుగనున్న నాతనితో వెయ్య
ము సేయుదురే సురేంద్రుఁడే। తనరఁగ నబ్బురిం
గలసి తానుసుధంగని దైత్యసాధునిఁ। గానుమనఁ

దయ్యోనిందకయుఁగోత్రాను వేల్పులఁగూడి కేశ
వా॥ ౯౨॥

పెద్దలనొవ్వఁబలికినను వేగిరమేకమవర్తి
సద్మము। దొడ్డకమిరఁ జేరు దరితోడ్తఁ దైవి
హారింపవేమునికి। బుద్ధికనందమంచు బహుబో
ధనొనర్చిన కంసుమీందుఁలెన్। పెద్దయుధిక్క
రించి తుదిఁ బ్రొతలంబున కేగె కేశవా॥ ౯౩॥

ఘనతరకల్మషంబు మదిఁగలిగిన శత్రువు కా
ర్యవాదియై। వినయవిధేయతల్ గలిగి వెంటను
నిచ్చలు సంచరించినన్। గనికరమైనతజ్ఞునిఁ గ
న్నెఱుఁ జూడఁగరాదు చిల్కపి। న్ననువునఁ బెంచి
పెంచి యొకనాఁటను భేకముఁ బట్టె కేశవా॥ ౯౪॥

పలికసత్ప్రయోజనము హ్రస్వముగా నవరిం
ప నేర్పుధీ। శాలి ప్రధానియౌ గరుఁడె చాలు
ను వీలుగ రాఘవత్సమా। పాలుని కార్యభారము
ను భానుసుతుండు వహించి బుద్ధిచే। మేలుగ ని
ర్వహించి తనుమిక్కిలి గన్నతి నొందె కేశవా॥

చెలువుగఁ గాంతుపై సతికిచిక్కని మోహ
ము లేకయుండఁగా। బొలుపుగఁ బెండ్లి సేయుట
నుఁబూనఁగరాదు ఘటోత్కచార్థమై। యలయ

క రాజపుత్రియగు నంబను భీష్ముఁడు తోడితెచ్చి
నన్ । వలసినచోటికేగుమదివంచిత్తగా వెతనొం
దె కేశవా ॥౯౬॥

అనుమతి దప్పియున్నఁ దన యాగసునైనను
నొప్పఁబలుకబల్ । వనుపున నయ్యయాతి కలి
శాప వశంబునైనెగ్గధనన్ । గొనుమనఁగా య
దుండు ప్రతికూలము లాడిన రాజ్యమేల నీ । త
నయుల సహాయులౌదు రని తానగఁడే దయలేక
కేశవా ॥౯౭॥

నెనరు దయారసంబు కడు నెమ్మియు నమ్మిక
గల్గువారికిన్ । ఘనతరమైన నెమ్మనము గోకంపహీ
నతిసొందిపాసినం । తనె మదిహత్తదేగతిని తద్వి
ధమెట్లన పాలుకల్మషం । బున పికలత్వమొంది
యదిపొందునె ముక్తిలీల కేశవా ॥౯౮॥

తన్మగసంచరించుచును దాలిమిమాలిదురా
గ్రహంబుతో । నెప్పుడు సాధువంచనము నించు
కగొంకక చేయవచ్చునా । నుప్పునఁగాలకింకరు
లు మూగిన దుర్గతి సాధ్వసంబుచే । నొప్పగ
శాంతభావముమబొందిన ముక్తిరేవారు కేశవా ॥

అలయికమూఖ చిత్తున కహానిశ మత్యభి

వృద్ధి గోరుచున్ । సొలపుగ వాక్యమున్ గలిపి
స్పృశించు వాఁడు నిరాకరింపఁగాఁ। గలఁగుట
కంటె సజ్జనులుగా సిరి జెందక వాని సన్నిధిన్।
మెలఁగక యెవ్వ రేమనిన మిన్నక యుండుట
లెస్స కేశవా॥౧౦౦॥

ఇలను వ్రతోపవాసముల హీనత నొంది కృ
శించి యాత్రకటన్ । మాలములమాడి దానమిడి మా
నుగఁ బుస్తుటకంటె ధీయుతుల్ । దలిపిగ నన్యుల
న్వదిలి దేశికునిన్ భజియించి శౌరికిన్। జులక
గవంజలెత్తినను జారగ మోక్షముఁ గల్గు కేశవా॥

భవహర మత్స్యకూర్మ కిటిభాసుర మాన
వసింహ వర్ణిభార్గవ రఘురామ సీరధర రామ
జగద్ధితబౌద్ధ కలికి నా। సువిధ దివ్యవైభవసమ
న్వితదేహ ఖగేంద్రవాహన। నన్ను గుణదోష
ములఁ దొలఁగ నాదర దృష్టిని జూడు కేశవా॥

నాముఃనీపదాబ్జములు నమ్మితిగాన వెణంగు
వైఖరిన్। వేమఱుఁదోఁచ రీతిగను వీలుగ విన్నవ మా
చరించితిన్। కామితమేమి లేదు నను గాచినసాం
పగు నీయడుంగు కెంపు దామరలే భజించెదను
దాసిని సత్కృపనేలు కేశవా॥౧౦౩॥

ముదమున శ్రీగోడేకుల సముద్రసుధాకరుఁ
డుల్లసద్రమా। సదనుఁడు జగ్గరాయనికి సాధ్వి
కిఁ జెల్లమకున్ తనూభవన్। మదివె సుభద్ర
సాఁబరగు మానవతిన్ కృతినీకొసంగితిన్। సద
యతఁ దప్పులన్నియును సాదర లీలను సైఁపు
కేశవా॥౧౦౪॥

ఘనతర విశ్రమంబులు వికాసపు ప్రాసలు
శబ్దసంధులుం। గణనియమాదికం బెఱుఁగఁ గం
జదళాక్షుని భక్తరక్షునిన్। జనువునఁబ్రస్తుతిం
చితిని సత్కవులార మహాత్ములార స। జ్జనము
లార వేఁడెదను సత్కృతిగా సనరింపుఁడీ
కృతిన్॥౧౦౫॥

ఘన పరిచర్యలందుఁ దగు కార్యములందును
ధర్మసంగరం। బున శయనించు వేళలను భోజ
నకాలమునందునన్ క్షమా। గుణమున దాసి మం
త్రియను కూలియు రంభయుఁ దల్లి ధాత్రిలా।
గున జరియించు భార్య కులగోత్రము లెంతయు
నుద్ధరించెడిన్॥౧౦౬॥

పరగఁగఁ బంచపర్వములపాత్రయుఁ దాఁ
కను శౌరిమాలు గా। నరమరలేక నాలుగును నా

లును వాఁకను దాసు మాలుగా। సారదిక పోడ
శాబ్దమున జొచ్చిన పుత్రి మిత్రి మాలుగా।
సురుచిర లీలగాఁదలఁప సూటియగున్ దలిదం
డ్రి కెంతయుఁ॥౧౦౭॥

నెమ్మి దలిర్పఁగూర్ర ధరణీపతిదర్శన మా
చరింపఁగా। కస్తూరి తాంబులంబయిన గారవ మొ
ప్పఁగాఁ సంగ్రహించు నీ। నెమ్మది నేలగుండెదవు నిర్ద
య మర్దన సేయ కీగతిన్। బొమ్మను టే మహాఫ
లము భూసుర సత్తమ వేయు నేటికిన్ ॥౧౦౮॥

సకలవిధంబుల న్నుమతి సఖ్యమొనర్చి వివేక
హీనతన్। బ్రికటముగాఁగ మైత్రి నెడఁబాసిన
వ్యాసల మొందనేల తా। నుకుటిలలీలఁ గలసి య
ర్థము చాత్రిణములుండ నీకిరియన్। పికలతనొం
దుటే ఘనము వృద్ధియు మేలును సజ్జనోత్తమా॥

కలితరసాల సూనములు గల్గిన దాడిగఁదన్న
గంబుస। త్ఫలములుగోరి చేరి పరిపక్వఫలంబుగో
నంగఁబోవ నీ। వలమటఁజెందఁ దోలి యడివా
య సమానినఁగుంద నేలను। జ్వలనిశితాసితుల్యఘ
టచంచు నఖంబుల దేహామెల్లఁబ్రి। ద్దలుపడఁగ్ర
చ్చి చీరుటలు తప్పుట చాలదె కీరరాజమా॥౧౧౦॥

సరసత ప్రావము మాధురియుం జారు శరీరము
కాంతియుక్తమున్ । బరగవము మార్దవంబు శమ
భవ్యము వర్ణన కెక్కఁ జేసియు । నీరస ము
నొందని నీహృదయ మింతగ వజ్రనిభంబుఁ జే
సెనే । వర సహకార సత్ఫలము వారిజగర్భుఁడు
నిర్దయాత్ముఁడై ॥ ౧౩౧ ॥

సరసిజసంభవుండు మృగసంఘము ద్రించఁ
గఁ జేసె బేలనై । తనుతనుగఁ గుక్షిలోమృగమదం
బిడి యొల్లుగ కొండె గాండ్రుదు । స్థిర రసనాగ్రి
మందిడినక్షిపత్రము వారునశింతు రాతలిన్ । సర
సరతుల్ బుధోత్తములు సత్కవులున్ వినుతింప
మందురే ॥ ౧౩౨ ॥

సరసిజ పత్ర మందు వీరసంబుగఁ గర్వము
నొందనేటికే । కరము విరాజమానముగఁ గాంత
లకంఠములందు నుందువో । నరపతు లెందతేని ని
నునాడెము సేయువిభూతి గాదువో । స్థిరము గు
విల్వ కెక్కునప్రసిద్ధి వహింతు వె నీటిముత్తెమా ॥

ఘనతరసౌరభోత్కరము గన్నది యింత తవతే
పమేలవి । నన్నువ గురూపసరపదము నవ్యగమంచి
తదివ్యవాసనన్ । గొనకొనినీకు నెకుత్వగుకోటి

మణుంగుల కప్పురంబు నీ। మనమున నిజ్జ వేగట
లుమాను మిక్కైనఁ గురంగనాథమా॥౧౧౪॥

దక్షతలేనిమందిరము తథ్యము పల్కఁగలేని
సాక్ష్యమున్। పక్షములేని బంధువును భావమె
ఱుంగనివాని చెల్మియు। న్నక్షులు లేనిజీవనము
హాస్యకవోగిరమబ్బనట్టిరూ। కుక్షిసదా నిరర్థక
ముగో గణపాలన కంసమర్దనా॥౧౧౫॥

సరసులులేనిరచ్చయును సామము నేరనిగా
యభారమున్। సరసతలేని కూటమియు సారవి
భాగము లేనిమంత్రియుఁ। నరపతిలేనిరాజ్యము
ను నాగరికత్వము లేనినాట్యమున్। గరముసదాని
రర్థకము కంజదళేక్షణ లోకరక్షణా॥౧౧౬॥



# శ్రీ కృష్ణశతకము.

## SRI KRISHNA SATAKAMU.



శ్రీకర రామానుజులనఁ। బ్రాకటముగ నవతరించి భక్తులఁ గరుణన్। సాకల్యంబుగఁ బ్రోచితి। పాకారిప్రముఖ వినుత ఖండన కృష్ణా॥౧॥

చేతన సంరక్షణ సం। ప్రీతిని వరదార్యులై నెడి పేరనుధరలో। ఖ్యాతిగ నుదయము నొందితి। పాతకహర దైత్యవీర భంజన కృష్ణా॥౨॥

శ్రీరుక్మిణీ మనోహర। వాగ్విభూషణ శరీర శాంత విహారా। మారవికార విదూరా। నారదవినుత ప్రచార నగధర కృష్ణా॥౩॥

యాదవవంశ పవిత్రా। సాదరలక్ష్మీకళత్ర పారసనేత్రా। వేదవినోద చరిత్రా। మోదావహ చిత్రగాత్ర మురహర కృష్ణా॥౪॥

శ్యామల కోమల రూపా। రామావిమలానులాప రాజిత పాపా। తామసయుతజన కోపా। సామజనుత గుణకలాప సాదరకృష్ణా॥౫॥

మందార కుసుమభాసిత। నందసుతా నందచరిత నతజనభరితా। కందర్పవైరిపూజిత।నందసునందాది ప్రణుత నరనుత కృష్ణా॥౬॥

శరణాగత సత్పోషా। కరుణా యుత విగత
దోష కౌస్తుభ భూషా। ధరణీసురసంతోషా। వ
ర గోపీ మోహవేష భామా కృష్ణా॥ ౭॥

కరుణారసాల వాలా। నరపాల యశోవిశా
ల నవరసలీలా। వరచామీకర చేలా। సురనాథ
సుపుత్రిఖేల శుభకర కృష్ణా॥ ౮॥

పాండవ మధ్యమ సారథి। యండజరథ సు
రవినోది యసుగ విరోధీ। పండిత కరుణా వారి
ధి। మండిత శౌర్య నిధి గుడుధి మాధవ కృష్ణా॥

బృందావన సంచారీ। మందార ప్రసవధా
రి మధుసంహారీ। వందిత వేద విచారీ। మందర
గిరి ధారి శౌరి మధునుత కృష్ణా॥ ౧౦॥

కలిహంగణ కలిత భాషణ। ఖలశోషణ కమలచ
రణ కమలాదరణా। బలభూషణ కరిపోషణ। బ
ల దానవనాశ బాణ బహురణ కృష్ణా॥ ౧౧॥

గోపాలక పరిపాలక। గోపాలక విమలకరి
త గోడాలోకా। తాపస లోకాలోకా। భూపా
లక జలధిచంద్ర బుధనుత కృష్ణా॥ ౧౨॥

నేరరు ఫణి రుద్రాదులు। నేరరు బ్రహ్మాదు
లైన నేరరు కవులున్। పారముముట్ట నుతించ
ను। ధారాధరవర్ణ నాకుఁ దరమే కృష్ణా॥ ౧౩

మతికిని గోచరమగు గతి। సదయాత్మా నిన్ను భ
జింతు సదమలరీతిన్। ముదమలరఁ జిత్తగించవె।
కదన భయంకరశరీర కలిహర కృష్ణా॥౧౮॥

గోనకొని భవదీయ కృతిన్। ఘన దోషము
లున్ననైనఁ గమనీయ గతిన్। మనమున సజ్జను
లెంతురు। గుణహీనులు నెంచకున్నఁ గొదువ
యె కృష్ణా॥౧౯॥

రసయుక్తము గాకున్నను। పసఁదనరిన తావకీ
న భజనము వలసన్। భసితంబగుఁ బాతకమని।
పాసఁగ నిను సన్నుతింతు బుధనుత కృష్ణా॥౨౦

మేదిని వేఁడినఁ గరుణను। సాధుగ వసుదే
వునకును సజ్జను లలరన్। గాదిలి తనయుఁడవ
గుచును। మోదమున జనించినావు మోహ
నకృష్ణా॥౨౧॥

నందుని సుతుఁడన జనములు। పొందుగ రేప
ల్లెకరిగి పోషింప మహా। నందముగాఁగ యశోద
కు। మందరధర పెరిగితివి మహానుగఁ గృష్ణా॥౨౨

పూతన కుచముల విషమును। వాతను మధు
రిమను బూని వంచనమున వి। ఖ్యాతిగఁ బాల్నీకి
చ్చిన। చైతన్యముఁ బాపినావు చలమునఁ గృష్ణా॥

శకటాసురుఁడను దైత్యుఁడు। నికటముగాఁ

పైనిబడిన నిర్జరులలరన్ | ప్రకటముగాఁ బదహతిచే | శకటమును గాఁ గూల్చితివి వేంకట కృష్ణా ||

తొట్టెనిడుకొను జననికి | నడిగొండగ నిరువు నోర నలువు దెలిపెన్ | తడఁబడ సిరఫూప్తలి నిడౌకమాయలను పరిహస్తమునఁ దనుకృష్ణా ||

అత్తఱిఁ గంసుని యానతి | నెత్తిన నడుచు దనుజుండొకఁడు నిను సుడిగాలై | యెత్తుకొని పోవ వానిని | కుత్తుకబిగియించి ధరను గూల్చితివి కృష్ణా ||

ఒకనాఁడు తల్లిపెఁగ్రుప | సకలేశ్వర యావులించి సర్వజగంబుల్ | నికరముగా ముఖమందున | సుకరముగాఁ జూపినావు సుదతికి కృష్ణా ||

శీలుఁడు గర్గమహాముని | బాలుఁడ నీకును నామకరణ భాసితుఁజేసెన్ | వేలుగ వసుదేవాఖ్యుని | లాలిత విస్పష్టవలనఁ గ్రమమునఁ గృష్ణా ||

పాడుచు ముచ్చటలాడుచు | నాడుచు గోపాల బాలకోటికి తోడై | తోడగు హలధరుతోడను | నాడితి బహుగతులఁగరుణ నచ్యుతకృష్ణా ||

గోపాలసుందరాంగుల | ఘూపాటక చౌర్యలీలఁ బొందితి మిగులన్ | గోపికలతో విహారము | ప్రాపుగఁ గావించినావు బహుగతిఁ గృష్ణా ||

పాలును పెరుగును వెన్నయు | చాలఁగ భ

త్రింపి మిగులఁ జనువుఁగఁదిరుగన్। లాలితముగఁ
జోరత్వము। వాలాయము జారతనము వచ్చెన్
కృష్ణా॥౨౭॥

గోపాలసతులు మదిలోఁ। దాపముగొనఁ
బాలు నెయ్యి దాఁగిపుదువనుచన్। కోపుఁగఁదా
వక జననికిఁ। గోపంబునఁజెప్ప పోవఁగూడెను
కృష్ణా॥౨౮॥

మన్నారగింతు వనుచును। మన్ననతో నయ్య
శోద మానుమటన్నన్। తిన్నగనీపిడినమ్మకు। మ
న్నాయు సఖులును ఘటించిరంటివి కృష్ణా॥౨౯॥

వాసన యాఘ్రాణించని। హాసంబున నోరు
దెఱవ నఖిలజగంబున్। వాసిగఁగానంబడియెను।
నాంశతికి విరక్తి మొదవ నలువుగఁగృష్ణా॥౩౦॥

జగమంతయుఁగన్నులఁగని। శకటాహానుఁడి
తఁడటంచుఁ గామిని దలపన్। నిగమార్థ విను
త రయమున। తగు మాయను గప్పినావు తల్లిని
కృష్ణా॥౩౧॥

భ్రాంతిగాని నందసుందరి। కంతుని గురుఁడ
నుచు నిన్నుఁగానక మదిలో। నెంతయుఁ గొడు
కను ప్రేమను। సంతతమును లాలనంబు సలిపె
ను కృష్ణా॥౩౨॥

తనయింటి యింతులందఱు। పనులందవిలియుండ నందు పడఁతుక కవ్వం। బనువుగఁ గైకొని పెరుగున్। గొనకొని తరువంగఁ జొచ్చెఁ గుదురుగఁ గృష్ణా॥ ౩౩॥

నిద్దపు గజ్జెలు మ్రోయఁగ। ముద్దులు గుల్కఁగను నీవు మురిపెము దనరన్। తద్దయుఁ బాలి మ్మనుచును। రద్దుగ కవ్వంబువట్టి లాగితి కృష్ణా॥

నిను తనయూరుల పైనిడి। వినయముగాఁ జన్నుగుడిపి విస్మృత లీలన్। మనుగాఁచు పాలు పొంగిన। ఘనతరముగడించిపోయెఁ గ్రక్కున కృష్ణా॥

అత్తఱి దధికుంభంబును। బొత్తిగ పోఁగొట్టి వెన్న భుజియింపఁగఁ ద। చ్చిత్తమునఁ గినుక గొని నిను। తత్తరముగ తల్లిచూచి తరమఁగ కృష్ణా॥

చని వేఱొక యింటికిఁ జని। పనివడి రోటనువసించి భాసురలీలన్। దిని యుట్టిమీది వెన్నయు। ఘనముగ వనచరము కొసఁగఁ గనిరొను కృష్ణా॥ ౩౭॥

కనుఁగొనఁగ కినుకఁ జనింపఁగఁ। జనువుగ నిను రోటఁగట్టె సమ్మతి దనరన్। మనమున నారదవచనము। పనివడి పాలింపఁ గట్టఁ బడితివి కృష్ణా॥

ఎటువంటి మనసు గలదో। పటుమతి గోపా

లవనిత భక్తుల కెందుఁ। ఇటువంటి చనువు గ
లదే। ఘటనాఘటనా సమర్థ ఘనుఁడవు కృష్ణా॥

గోత్రధర నీదు కరుణకుఁ। బాత్రులుగారె
వరు గోప భామిని మాడిరన్। మిత్రాసుమధర
సారస। పత్రాక్షికిఁ గలదె యింత భాగ్యము
కృష్ణా॥౪౦॥

గాత్రమునను రంతు నిందిర। పుత్రుండను ప
ద్మజుండు పుణ్యుఁడు హరుఁడున్। మిత్రుఁడు
యశోద తల్లియు। చిత్రమతీ నీకు లోక సేవిత
కృష్ణా॥౪౧॥

మద్దులఁగూల్చుటమదిలో। సద్ధర్మంబనుచుఁ
దలఁచి సరగునఁ జనవే। పెద్దయులూఖలమీడ్చు
చు। ముద్దుగ కుజసన్నిధికిని ముదమునఁ గృష్ణా।

అర్జున యుగ్మము మధ్యకు। నర్జునసఖ
నీవుపోయి యడ్డుగఁ బైకిన్। నిర్జరనుత రోలీడ్చి
న। గర్జితగతిఁ గూలెఁ దరులు గ్రక్కున కృష్ణా॥

వృక్షంబుల సలిలముగ। యక్షులు నిద్దఱు
జనించి యాదవకులసం। రక్షక తావకపదములు।
రక్షకమని మ్రొక్కి రపుడు రతిచేఁ గృష్ణా॥౪౨॥

తల్లియగు గోపకాంతకు। నెల్లసుఖంబులు
ను గలుగ నెంతయు ముద్దుల్। గొల్లలుగాఁ గృప

సేయుచు। నుల్ల మలరఁ బ్రొద్దు జరుపుచుంటివి
కృష్ణా ॥ ౪౫॥

బృంధావనమునఁ కరిగిన। సందేహము లేక
దైత్యసంచారంబున్। జెందదుహరికని నినుగొ
ని। యందముగానందుఁ జరిగెనటకును కృష్ణా॥

గోపాలబాలకులతో। గ్రేపులమేపుచు నడ
విఁ గేరుచుఁ గ్రీడల్। గోవుల తీపెలుట్టఁగఁ।
బాపహరా సలిపితౌర బహుగాఁ గృష్ణా॥౪౬॥

నినుహింసింతునటంచును। మనమునఁ దలపో
సి దైత్యమానితుఁ డొకరుం। డనువగు లేగపిధం
బున। చనువుగ నీవెంటఁ దిరిగెఁ జలమునఁ గృష్ణా॥

మంచిది వత్సంబనుచును। వంచనమునఁ గా
ళ్ళతోక వరబట్టితగన్। ఇంచుక వేఁగమ గొట్టితి।
కొంచెపు వత్సాసురుండు గూలెను కృష్ణా॥౪౯॥

బకమై పొనవుఁ డొకరుఁ డు। సకలేశ్వరు
మ్రింతుననుచు సరగున నిన్నై। ప్రకటముగా మ్రా
గ్గినను। వికలముగాఁ గూల్చితీవు పింతగఁ గృష్ణా॥

దనుజుఁడు పెనుబాముగుచును। గొనకొని గో
వత్సములను గోపాలకులన్। నినుమ్రింగినఁ గం
ఠంబున। ఘనకాయము పెంచి నేలఁ గలిపితి
కృష్ణా ॥౫౧॥

పాపవిషంబునమ్రగ్గిన। పాపలఁ గలను గృ
పనుబ్రతికించితగన్। బ్రాపుగఁదోడ్తొని యిం
టికి। దాపుగనరిగితివి చాలదయతోఁగృష్ణా॥౫౦॥

తావకమహిమలుగనితన। భావములోఁగమ
లజుండు భ్రాంతుండగుచున్। యేవిధిపత్సా భక
తులను। చావఁగ బ్రతికించె ననుచుసరగునకృష్ణా॥

మెండుగదూడలకొఱకై। యండజరథ నీవుపో
వనాతేఁగలతో। నిండగుబాలుర గుహలో। దం
డిగఁ బ్రహ్మాసనుండు దాచెను కృష్ణా॥౫౪॥

కేళిపుటఁజెలులనుగానక। యీపని విధిచేసె
నెంత వెదఁగతఁడనుచున్। గోపులగోపుల రూప
ము। లేపుగధరియించిమంద కేగితి కృష్ణా॥౫౫॥

ఒకయేఁడీగతిజరిగిన। సకలమయినగోప వత్స
సముదాయింబున్। నికరముగానీరూపునఁ। బ్రక
టముగాఁగానఁ బడిరొ బ్రహ్మకుఁగృష్ణా॥౫౬॥

చూచి కనుమూసి భయమున। నీచపుపనిఁ జే
సితనుచు నెటి గోపకులన్। దాచిన వత్సలనిచ్చె
యు। నీచిత్తముగరుగఁబొగడె నెమ్మినికృష్ణా॥౫౭

పావనపాగండంబున। గోవులఁగాచితివిసాం
టిగోపకులరన్। సేవకులుసంతసింపఁగ। భావ
జరూపస్వరూప భవహర కృష్ణా॥౫౮॥

సుందరమగుగోవులఁగాని । మందకుని వేగ
గోపమదవతి వేడ్కన్ । పొందుగమజ్జనభోజన । చం
దనకుసుమాది విధులు సలుపుచు కృష్ణా ॥ ౫౯ ॥
ధేనుకవనమునకరిగియు । మానుగఖరదైత్యు
దునిమెమసలకహాలముం । బూనినరాముఁడునీ
వును । వానిభటులఁజంపితౌర మఱవక కృష్ణా ॥
గోవులుగోపాలకులును । లావగుకాళిందిజ
లముఁరంజితమత్తులై । చావుచునసువులఁ బాసి
న । శ్రీవిలసిల్లంగబ్రతుకఁజేసితి కృష్ణా ॥ ౬౧ ॥
కాళియు సంపర్కంబునఁ । గాళిందికి నిర్మల
తయుఁ గలుగదటంచున్ । నీళాధవ కాలాహిని ।
పాలనమున వేఱు నదికిఁ బంపితి కృష్ణా ॥ ౬౨ ॥
ఆరాత్రి దావ దహనము । ఘోరముగాఁ
బైనిగవయ గోపజనంబుల్ । పారామలమంగవేఁ
డిన । దారుణముగఁ గారుచిచ్చుఁ ద్రావితి కృష్ణా ॥
పొందుగఁ బ్రలంబదైత్యుని । కందుక క్రీడను
చుఁజేసి ఘనుఁడగు హలిచే । నందముగాఁ జం
పించితి । నందకధర యప్రమేయ నయముగ
కృష్ణా ॥ ౬౪ ॥
దావానల భయమున తముఁ । గావను గోప
కులు వేఁడఁ గరుణను కన్నుల్ । మోవకుల మూ

సుకోమ్మని। పావకపానముఁ నోనర్చి ప్రిబలితికృష్ణా॥

గోపకు లాఁకటిచేఁగడు। తాపముగొని యశనమడుగ ధరణీసురులీ। దాపున నున్నా రదు గుఁడు। పాప హరులు నిడుదురనుచుఁ బంపితి కృష్ణా॥౬౬॥

చని వారలు బ్రాహ్మణులను। గని ఐద్వచనములు దెలుపఁ గలుషముతో తే। దనిరన్నము తద్వ్రతఁయు। విని మీరలువారి సతుల వేఁడఁగఁ గృష్ణా॥౬౭॥

పంపిరి యోగిరమున్నకై। సొం పారఁగ గోపులరిగి సుందరులారా। పెంపుగ నాఁకొని శ్రీహరి। పంపెను యాశకుఁ దనిన భక్తిని కృష్ణా॥౬౮

సురుచిర సంపన్నంబై। శరము పెప్పడి బోజనంబు ఘటములనిడి వా। రరిగిరి బంధులు వలదన। సరగున త్వత్సన్నిధికిని జానుగకృష్ణా॥౬౯॥

భూసుర కాంతలు దెచ్చిన। భాసురతర భక్షణములు బంధుల పత్తిఁన్। వాసిదలిర్ప భుజించితి। దాసులయినవారియందు దయచే కృష్ణా॥

ఇంద్రి సవనంబు చారున। గేఁద్రి మునకు నాదరింప నింద్రుం డలుకన్। సాంద్రముగ శిలావృష్టిని। పేంద్రి వడిఁగురియఁజేసె వినూ

క కృష్ణా ॥౭౧॥

గోవర్ధనగిరి యెత్తితి। గోవులు గోపాలక
తులు గోపాలకులున్। కావక యమునననుండి
రి। నీవే పరతత్త్వమనిరి నిజముగ కృష్ణా ॥౭౨॥

తగనాఁడొకదినమున। పగలును రాత్రి
యును గురిసె బలువగు రాళ్లం। బిగువెడలి చేత
గాళను। వగనొంది బలారివచ్చి వలనుగ కృష్ణా॥

అపరాధిని నేపమెన్నక। కృపసేయ వేసన్న
టించుఁ గిల్బిష మెడలన్। తపియింపుచు త్వత్ప
దములు। జపియించెను భక్తివజ్రి చనువుగ కృష్ణా

దీనతను శచీనాథుఁడు నానావిధ నతులొన
ర్చి నయ మొప్పంగా। గోనాథునిగా నిన్నును।
మానుగ నభిషిక్తుఁ జేసె మన్ననఁ గృష్ణా ॥౭౫॥

నందుఁడు హరివాసరమునఁ। బొందుగ ను
పవాసమునను బూని చరిత్రున్। సందకధరుఁ
బూజించియు। మందమతిన్ నాటిరాత్రి మసల
క కృష్ణా ॥౭౬॥

స్నానము రాత్రుసవేళను। మానుగనొనరిం
ప వరుణ మందిరమునకున్। ధీనిధి నందుని గొ
నిచనె। దానవుఁ డొకఁడేగుదెంచి దబ్బున కృష్ణా॥

అత్యాజనకుని పోఁడ। చిత్తంబున గోచరిం

చి చెన్నుగ మీరల్। పొత్తుగ నచటికిఁ జరిగిన। త
త్తరముగఁ బూజచేసి తగవుగ కృష్ణా ॥ ౭౮ ॥

నందుని వరుణుఁడొసంగిన। నందమలరఁది
రిగివచ్చి నలువుగనీవా। నందాదిగోపకులకును।
సుందరముగ బ్రహ్మపురముఁ జూపితికృష్ణా॥ ౭౯

నందాదులు జాతరచని। యందముగా భవు
భవాని నర్చించితగన్। పొందుగనుపహారంబిడి।
యందముగా నిద్రబోవ నలవుగ కృష్ణా॥౮౦॥

ఆఁకొని యురగము నందుని। దీకొని కరచి
యును మ్రింగఁడివురఁగనీవా। లోకించి త్రొక్కు
టయు ద। ర్వ్యాకరరూపంబువాసి పెంపుగకృష్ణా॥

సుందర విద్యాధరుఁడై। పొందుగ జోహారొ
నర్చి పూరిత నుతులా। నందముగ నొనర్చియు
తను। బొందినగతి విన్నవించి పోయెను కృష్ణా॥

పీడితముగ సత్య మొదలగు। సుదతులు నెన
మండ్రుమఱియు శుభగుణయుతలన్। పదునాఱు
వేలనూర్వుర। ముదితల నుద్వాహమైతి ముద
మునఁ గృష్ణా ॥౮౩॥

ప్రద్యుమ్నాదులఁ బలువుర। ఖద్యోతప్రభల
మీరు ఘనులను గంటయున్। చోద్యముగా ధార
ణిలో। మిథ్యాసంసారివగుచు మెలఁగితికృష్ణా॥

మురనరక కంసయవనుల। శిరముల ఖండిం
చి మించి చెలువుదలిర్పన్। సురుచిరముగ ద్వా
రకలో। నిరతమును వసించినావు నెమ్మిని కృష్ణా॥

శ్రీమీన కూర్మపోత్రి। ధీమహితా నారసిం
హా దివిజారిహరా। వామన రామా రామా।
రామా హరి బౌద్ధ కలికి రఘువర కృష్ణా॥౯౬

కృష్ణా దానవనాశన। కృష్ణా పాపండదహ
న కిల్బిషహరణా। కృష్ణా కంసవిదారణ। కృష్ణా
వసుదేవుముద్దుకీరమ కృష్ణా॥౯౭॥

కృష్ణా ముద్దులకృష్ణా। కృష్ణా గోపాల బాల
కృష్ణా కృష్ణా। కృష్ణా మోహనకృష్ణా। కృష్ణా న
వనీతచోర గిరిధరకృష్ణా॥౯౮॥

కృష్ణా భగవద్భక్తియు। కృష్ణా భాగవతసే
వకిల్బిష మెడలన్। కృష్ణా దేశికప్రీతియు। కృష్ణా
మోక్షకేదనొసంగుకృపతోఁ గృష్ణా॥౯౯॥

శతకంబనుతులసీదళ। మతి ముదమున త్వత్ప
దాబ్జముందునరిడితిన్। హితవెఱిఁగిచిత్తగించవె।
గతినీవే భక్తవరద ఖలహరకృష్ణా॥౧౦౦॥

మదినెనుభద్రను దాసిని। సదమలమగుత్వ
చ్చరిత్రచనువిచ్చుటచే। నొదుగుచు సన్నుతిజే
సితి। మదితప్పుసహించియేలుమాధవ కృష్ణా॥

యతి ప్రాసలు గణగణములు। నతిమాత్రం
బెఱుఁగ హరినయాదవకృష్ణున్। నుతియించితి భ
వహరమని। మతిమంతులు తప్పు దిద్ది మన్నించ
రయా ॥౯౨॥

శిలపైఁగలపము నలదిన। పొలుపుగ నూజాణల
నాథముక్తము దినినన్। జలమున నరూపముఁ జూ
చిన। యలయిందిరశ్రీకి నైన హానిజనించున్॥

గుడి మోచు ప్రతిమవలెనీ। వెడమాయను
మునిఁగి జనులు వెంతయుఁ భవమే। వడువునగడు
పుదు మోయని। కడు భరము వహించి యుం
డు ఘనముగఁ గృష్ణా ॥౯౪॥

పలుకులకుఁ దగినపలుకులు। పలికినఁ దక్షణమె
పలుకఁబోగా నపుడున్। బలుకక వెనుకను వగచు
ట। పలుగాకితనంబు మిగులఁ బందతనంబున్ ॥౯౫॥



## శ్రీ సింహగిరి శతకములోని పద్యములు.

## STANZAS FROM SRI SIMHAGIRI SATAKAMU.



శ్రీకరంబుగ ధాత్రిఁ జిత్రభూసుందరా-కా
రంబు గైకొని కాంతిదనర। వరశరణ్యాచార్యవ
నితగర్భంబున-సజ్జనులలరంగ సంభవించి। రా
మానుజాచార్య నామంబుధరియించి-కరుణాల
వాలుఁడుచిరయశుండు। కందాళవంశాబ్ధికలిత
శశాంకుండు-సదమలవిద్యావిశారదుండు॥ పతి
త పావనుఁడని బుధుల్ బ్రస్తుతింపఁ। బ్రొలుపు
దనరారభక్తులఁబ్రోఁచుతివు। సింహగిరిభూష ని
ర్మలాంచితమనీష। మధురసంభాష హార్యశ
మనుజవేష॥౧॥

కలితారిసుతతోష ఖండితాశ్రితదోష-సన
కాదిస్మృతనిజస్తవనఘోష। నతసురవ్రజనుత వి
తతాసురద్వేష- యనిశచందన లేపనాభిలాష।
రచితపాథూన్నేపరంజితవ్రజయోష- కమలావ
ధూమనఃకమలపూష। విహితార్యశుశ్రూష విల
సద్గుణ విశేష- ఘనహతాసురరాజకదనరోష॥
యాత్మశయనీ భవతోఁ మాలాంగ శేష। య

మిత కారుణ్య పరిపాలి తాంబరీష! సింహగిరి
భూప నిర్మలాంచితమనీష! మధురసంభాష
హార్యక్షమనుజవేష॥ ౨॥

లక్ష్మీసతీస్వాంత రాజీవ ఖరకరా- నగరాజ
ధీర వినాశదూర! విమలకోపిద నేత్ర కుముదని
శాకరా- కంధి గంభీర లోకైకవీర! గురుతరా
శ్రితదోష గోత్రపురందరా- వర శుభాకార
పావన విహార! పరవీర మాతంగ భంజన హరి
వరా- యతి మహోదార వేదార్థ సార॥
భూరిసౌరభ పాటీర సార లేప! రంజిత శరీర
ఘోర శాత్రవ విదార! సింహగిరిభూప నిర్మ
లాంచిత మనీష! మధుర సంభాష హార్యక్ష మ
నుజవేష॥ ౩॥

సూత్రవతీజాని సుగుణ వ్రజాస్థాని- సేనా
ని నతిభక్తిఁ జెంది కొల్చి! కలిత దాసోల్లాసుఁ
గంసారి సంవాసుఁ- బరమవిద్యాభ్యాసు వ్యా
సుఁ దలచి! యతిగమ్య గుణసాంద్రు నభినవశశి
చంద్రు- శ్రీనివాసబుధేంద్రుఁ జేరమ్రొక్కి! న
వ్య పల్లవపాణి భవ్య మోహనవాణి- పరమేశ్వ
రునిరాణి సంస్మరించి॥ రసికజనముల మనము
లు రంజిలంగ! సీసశతకంబు చెప్పెద చిత్తగిం

చు। సింహగిరిభూప నిర్మలాంచితమనీష। మ
ధురసంభావ హార్యత్త మనుజవేష॥౪॥

గరుడ విద్యాధర గంధర్వకిన్నర- సాధ్యులు
సిద్ధులు చారణులును। యక్షులు గుహ్యకాధ్య
క్షులు సన్మునుల్- నిఖిలాగమంబులు నిర్జరు
లును। శేషుండు భవుఁడును భాషాధవుండును-
సురలోక విభుఁడు నిర్జర గురుండు। తగు లీలఁ
దావకస్తవము సేయఁగ లేరు- దాసికి శక్యమా
ధన్యచరిత॥ నేరను తెన్నకకృపఁజూడు నేర్చుకొ
లది। దురిత మెడలంగ నుతియింతుఁ దోచినట్లు।
సింహగిరిభూప నిర్మలాంచితమనీష। మధుర
సంభావ హార్యత్తమనుజ వేష॥౫॥

భక్తి చేనీ పదపంకజయుగళంబు- భావించి సే
వించిపరిస్తుతింతు। నని నేరచింపఁబూనిన యట్టి
భవదీయ- కృతికతిసుందరాకృతియు మెఱుఁగు। న
వరసమాధుర్యసువిమలగాంభీర్య- మార్దవంబు
లును సమ్మదము నీను। ఘన వాగ్విజృంభణంబు
నునిష్ఠ తపనుండు- భువనంబునందమంబు బొర
యకుండఁ॥ జేయుచు వడుపున నీకృతి నేరమెడలను।
తప్పులను జెందకుండఁ గడనరఁ జేయు। సింహగి

రిభూవ నిర్మలాంచితమనీష। మధురసంభావ
హార్యతమనుజవేష॥౬॥

తనియఁ జండకయుండ మునుగోసి భక్షణ-
గావించఁగా చవిగల్గకుండు। నుత్తమతరమైన వి
త్తనంబులకును- గత్తువదప్పనుసదమలముగ। సు
రుచిర లీలను పరిపక్వమైయున్న- ఫలము ఫలంబి
చ్చుబంధురముగ। బీజముల్ ధాత్రిని బెంపార
హత్తింప- వృక్షంబులైసొంపు వెలయుచుండు-
కార్యసిద్ధిక్రమంబిది ఘనులకైన। కొన్నిరయము
నఁ గావింపఁ దిన్నఁబడవు। సింహగిరిభూవ ని
ర్మలాంచితమనీష। మధురసంభావ హార్యతమ
నుజ వేష॥౭॥

చక్కెరపాకంబుమిక్కిలిమృదువైన- జిగిబి
గిజాలక శిథిలమౌను। పదునుదప్పకయున్న ప్రివి
మలంబలరార- నుతినొందివెలుఁగొందు నతిరస
ములు। నదియుఁగఠినమైనఁ బదివేలవిధముల.
కొమరార నేమణో కొదువలుడిగి। యావిధం
బునసుండునేపాటుగా పాక- కార్యంబు తద్గతి
క్రమము మీఱ॥ నెలఁగివతిరుపసౌఖ్యముల్ నె
ఱిఁవహింపఁ। తెలియకున్నఁబరిక్రమ దొలఁగవు

శమె। సింహగిరిభూషనిమ్నగాలాంచిత మనీష
మధురసంభాష హర్యక్ష మనుజవేష॥౮॥

అగ్నిహోత్రంబింటనంటిన యంతనే- చ
ల్లాచల్లకన్నను సమయబడును। బదులు దీర్ఘశ
యున్న పాయిదామికిర్లి- విస్తీర్ణమైకోశవి
శలమవును। శన్యకుఁబెండిలికాలంబుదప్పిన- ము
దిమినొందును దానిఁ గదియరెవరు। కావునఁ
గార్యముల్ గావించవలెఁగొన్ని- సత్వరంబు
లరార సముచితముగ॥ బహువిధంబులఁదత్కార్య
భావ మరసి। నిర్వహించఁగ వలయును నేర్పు
కొలది। సింహగిరిభూషనిమ్నగాలాంచిత మనీష।
మధురసంభాష హర్యక్షమనుజవేష॥౯॥



# శ్రీ రాఘవ రామ శతకము.

# SRI RAGHAVA RAMA SATAKAMU.



మేరునగధీర వీరా। పారాచారపరిచార సా
ధువిచారా। పారావార విహారా। రారా నను
కరుణఁ బ్రోవ రాఘవ రామా ॥ ౧ ॥

వైశాఖపుర నివేశా। నాశకపాతక విదళన
నరవరమేశా। యీశా క్లేశవినాశా। రా శం
కరవినుతనామ రాఘవరామా ॥ ౨ ॥

గోపాల జాలలోలా। భూపాలా భక్త పా
ల బుధజనపాలా। గోపాల కనకచేలా। రాపా
తకనాశే యీశ రాఘవరామా ॥ ౩ ॥

శ్రీ విష్వక్సేనుల మది। సేవించెద మత్కృ
తిత్వ సిద్ధికి భక్తిన్। శ్రీ వనితామణిఁ దలచెద।
రావే నను కరుణఁ బ్రోవ రాఘవ రామా ॥ ౪ ॥

నామదిఁ బారాశర్యుని। నేమంబున సన్ను
తించి నిర్మలముగ నీ। నామామృతంబు గ్రోలె
ద। రామా సుగుణాభిరామ రాఘవరామా ॥ ౫

చారుతరంబుగ కలితన। వారితముగ నాదు
కవిత వర్ధిలవినయాం। బారనుతియింతు బుధుల
ను। రారా ద్విజారిభీమ రాఘవరామా ॥ ౬ ॥

నీకుఁదగు నుతికిఁ జాలరు। నాకులు యక్షు
లును సిద్ధనాథులు సురగుల్। నాకు నినుబొగ
డఁ దరమే। శ్రీ కమలా కలిత శ్యామ రాఘవ
రామా॥ ౮॥

ధరణీశయ నీకుఁ దగుగతి। ఫణిపతియు బృ
హస్పతియును భాషాపతియుం। బ్రణుతింపఁజా
లరెన్నఁగ। రణధీరానాకువశమె రాఘవరామా॥

గంగను గడిగినఁ బంకము। రంగమరఁగఁదొ
లఁగుపగిది రఘువరనిన్నున్। పొంగుచు నుతియొ
నరించెద। రంగా దుష్కృతముఁదొలఁగు రాఘ
వ రామా॥౯॥

నానుడుల నెరసులున్నను। నీనుతి పావనతఁ
గూర్చు నిర్జరనదిలో। స్నానము కల్మషమణఁ
చదె। నానావిధ భక్తవరద నరవరరామా॥౧౦

మతిహీనుఁడు త్వత్కథయని। హితమందక
తప్పులెన్న నేమికొదువయా। నతిఘనముగ బు
ధులెంచరె। ప్రతినత జన రత్న ధామ రాఘవ
రామా॥౧౧॥

పతితజనపావనుఁడవై। యతిదౌరితంబునుహరిం
చి త్వద్దాస్యంబున్। సతతముఁ గృపదనర శత్రు
శ్రీలువిను తా బొసఁగు వరద రాఘవరామా॥

మతిలో దివమును రాత్రియు। నుతియింపఁ
గఁ గరుణఁజేయ నార్జితగతిశ్రీ। పతినీపదములఁ
బట్టితి। వ్రతముగ నవకములదామ రాఘవరామా॥
కోరికలు గోరఁజేసియు। పారెకునాప్పించఁ
డగునె సదయుఁడవనినిన్। జేరితి నను రక్షింప
వే। ధారాధర నీలదేహ దశరథరామా॥౧౪॥
ఘోరములగు పాతకములు। నేరుపుతోఁజే
సినాను నేరము లెన్నన్। పారము పట్టఁగఁ జాల
ను। సారసదళనేత్ర సకలజననుత రామా॥౧౫
మోసము దోసము దొలఁగఁగ। వాసిగ సం
తాపభరము వదిలించు కృపన్। దాసిని కరుణ
కుఁ దగుదును। భాసుర సుగుణాభిరామ భవహ
ర రామా॥౧౬॥
అంతంబున యమకింకరు। లెంతయు భయ
మొదవఁ బట్టి యీడ్చెదరని నీ। చెంతకుఁ జేరి
తిఁ బ్రోవుదు। రంతము నా దురిత మెన్న రా
ఘవ రామా॥౧౭॥
కన్నడఁ జేసిన కతనఁబ్రి। సన్నులగతిఁ గాన
లేక బడలితి కదునా। పన్నుల నెందఱిఁ బ్రోచి
తి। కన్నన రక్షోవిరామ రాఘవరామా॥౧౮
అల హార్థ బ్రిహ్మేంద్రాదుల। నెలవుల పైఁ

గాంతు లేదు నెమ్మదిలోనన్। వలనొప్పఁగ నిను
నమ్మితి। లలితంబుగనన్ను బ్రోవు రాఘవరామా॥
తావక పదవనజంబులు। భావంబున గుదురు
కొలిపి పరిపరిగతులన్। సేవింతు వరము నీయ
వె। సేవకజన దురితహరణ సీతారామా॥ ౨౦ ॥
చిల్లరదైవంబుల మును। తెల్లంబుగఁ గొలిచి
ముక్తి తెలివేలుఁగని నా। కల్లలును బాటకంబు
లు। పిల్లదములు బాపివేలు రాఘవరామా॥
భవదీయ దాసజనులకుఁ। బ్రియమలముగదా
సులైన భక్తులనెల్లన్। సవినయముగఁ బూజిం
చెద। రవివంశ పయోధిసోమ రాఘవరామా॥
పలినవారలువిన్నప। మాలించకయున్న మా
కు నన్యులుగలరే। పాలించు భక్తవరదా। లా
లితవర రంగధామ రాఘవరామా॥ ౨౩ ॥
బంధుబు భ్రాతలటంచును। నందంబుగ సుతు
లటంచు నాప్తులటంచుం। గొందలమగు సంసా
రా। కిందన మెడఁబాపు కరుణరాఘవరామా॥
దేవేంద్ర పదవియందును। భావంబునవాం
ఛలేదు పాతకమెడలన్। తావక దాస్యమెకో
రెద। రావణసంహారవీర రాఘవరామా॥ ౨౫ ॥
దైవము తల్లియుఁదండ్రియు। భావింపఁగనో

దరులును బంధులు మిత్రుల్ । నీవనితలచెద ని
రతము। శ్రీపీతసిత కనక చేల సీతారామా ॥౨౬॥

పాపము పుణ్యమునీవని। మోపితి నీయందు
భరము ముదమలరఁగనే। నోపను జన్మాదులకిఁక।
శ్రీపరమ పదేశ యీశ సీతారామా ॥౨౭॥

గర్భనరకమున కోడెద। దుర్భావముతోలఁ
గఁ దొడరు దుర్దశలెడలన్। నిర్భరముగ దశ
రథ రుచి। రార్భక నను బ్రోవు కరుణ రాఘ
వ రామా ॥౨౮॥

వ్యాకులతరమగు సంసృతి। రాకలపోకలకునో
పరక్షింపఁదగున్। నీకారుణ్యమె కోరితి। శ్రీకా
మఫలప్రదాత సీతారామా॥౨౯॥

పాపాత్ములఁ గృపఁగాచిన। భూపాలాయశ
ముగలుగుఁ బుణ్యాత్ములన్। గాపాడ నేమిగలు
గును। శ్రీపార్థివపూర్ణసోమ సీతారామా॥

సంసారజలధిఁ గడపవె। కంసాంతక నీదుచ
రణకల్పమునశోక। ధ్వంసముగ సకలపాప। భ్రం
శముగాంచవయ్య రాఘవరామా ॥౩౧॥

నీకంటెఁ గదయు లెవ్వరు। నాకంటెను పతితు
లెవరు నాథ యనాథన్। ప్రాకటముగ ననుఁ
బ్రోవుము। శ్రీకలితయశోవిశాల సీతారామా॥

నీకుసరివచ్చుదైవము। నాకలలోనైన లేఁడు నమ్మితినెమ్మిన్। నీకెంత నన్నుగాచుట। శ్రీకరరాజీవనేత్ర సీతారామా॥౩౩॥

పరవాసుదేవ కేశవ। కరివరదా కామజనక కమలారమణా। గిరిధర మురహర హరి ని। ర్భరముగనను కరుణఁబ్రోవు రాఘవరామా॥౩౪॥

నావంటిదీనజనముల। సేవకులనుగాఁగ దిద్దిచింతలుదీరన్। యీవే తావకదాస్యము। నీవే నావిహితగతివి నిజముగ రామా॥౩౫॥

కరుణాసాగరుఁడందురు। కరుణనెచట దాచినావు కరుగవుగా నా। దురితభరముఁబాపవు దు। ర్భరభవమణఁగించి బ్రోవు రాఘవరామా॥

నావంటిపుణ్యహీనుల। నీవేరక్షింపవలయు నీకన్ననొరుల్। గావసమర్థులుగలరే। రావణదుర్మదవిరామ రాఘవరామా॥౩౭॥

చింతింపరాని పాపము। లెంతైనను నీదుకరుణఁగొనసాగినచో। సంతయురజమౌసంసృతి। భ్రాంతినిదొలఁగించు వరద రాఘవరామా॥

నేననఁగనెంతవాఁడను। నా నేరంబనఁగనెంత నాథ యనాథన్। నీనెనరునకేఁదగుదును। శ్రీనాగసుఖోపశయన సీతారామా॥౩౯॥

పాపముఁ జేసితినంటిని । రాపులకే నోర్వనంటి రహిమీరఁగ్రుపన్ । చేపట్టి యేలుమంటిని । శ్రీపరమనతాబ్ధిసోమ సీతారామా ॥౪౦॥

నీవే నాగతియంటిని । నీవే నను గావుమంటి నీకంటె నొరున్ । భావమునఁ దలఁపనంటిని । శ్రీవనచరపద్మమిత్ర సీతారామా ॥౪౧॥

యమునికి జడిసెద నంటిని । యమలోకముఁ జూడ నోపననియంటిని నా । భ్రమ లెల్లఁ బాపుమంటిని । క్రమ మొప్పఁగ నేలుమంటి రాఘవరామా ॥

దీక్షవహించితి దీనులఁ । బాక్షికతం బ్రోవ నీవు పామరురాలన్ । నాక్షేమమరయకున్నను । రక్షకమటి యెవ్వరుగలరు రాఘవరామా ॥౪౩॥

నామనవి చిత్తగించవె । వేమారును విన్నవింప వెఱఁగుగ నుండున్ । నామది నీపై నుంచఁగ । రామా బ్రతిమాలుకుందు రాఘవరామా ॥౪౪॥

కలుషములు శాశ్వతమా నే । పలు బాములనొందఁ జాలఁ బ్రస్తుతి చేతున్ । చలమునను దగుదు నే శ్రీ । లలనేశా దురితనాశ రాఘవరామా ॥౫౫॥

నేరుపు మదిలో నెఱుఁగక । కోరుట యే కాని నిన్ను గోరఁగ నేలా । కారుణ్యపయోరాశివి । రా రా కోరెదను చూడ రాఘవరామా ॥౪౬॥

రామారామా యనుచును। వేమారును బిలి
చిపిలిచి వేసారితి నీ। నామమునఁ బిలువఁబలు
కవు। రామా దయరాదె నీకు రాఘవరామా॥
కలియుగమందలి మనుజులఁ। గలియఁగ రాద
నుచు రావో కరుణవొ లేవో। యలుకో పలుకేప
లుకవు। లలితసకలమునివినోద రాఘవరామా॥
పలుకవు పలుమఱుఁ బిలిచిన। నలుకకు నేనెంత
దాననలభక్తులలోఁ। గలపినను ముక్తి యనిమెడి।
లలనామణిఁ గూర్పు కరుణ రాఘవరామా॥ ౪౯॥
తల్లియుఁ దండ్రియు నేటికి। యిల్లును బంధులు
ను సుతులు హితవరు లేలా। కొల్లలుగ దాస్యమొసఁ
గవె। ప్రల్లదములు వేయు నేల రాఘవరామా॥
తావకపదవనజంబులు। భావంబున సంఘ
టించి ప్రస్తుతి సేయన్। కావవె దూర్వాసునిమ
ను। శ్రీవిలసితదేవ భామ సీతారామా॥ ౫౧॥
కరిమకరితోడఁ బోరుచు। గరువంబునఁ గొ
న్నియేండ్లు గడుబ నలసటన్। వెరవుగని నుదలఁచి
నదు। ర్భరదుఃఖముఁ బాపితీవు రాఘవరామా॥
ముక్కనయటుకులు పిడికెడు। మక్కువ ద
నరారనొసఁగమాము గఁగొని పెం। పెక్కఁ గు
చేలునకిచ్చితి। గ్రక్కునసంపదయు ముక్తి రా

ఘవ రామా॥ ౫౩॥

నారాయణుఁడను పుత్రుని। సారము చెడియ
మునిపురికిఁ జనియెడు వేళన్। చీరినఁ గాచితజామి
ళుఁ శ్రీరాజితకీర్తిధామ సీతారామా॥ ౫౪॥

నీ పాదరజము సోకినఁ। బాపము చెడి ము
న్నహల్యభామా మణియై। ప్రాపున గౌతముఁ
బొందదె। శ్రీపరమపవిత్రగాత్రసీతారామా॥

కౌరవులువలువలొలువఁగ। గారవమునద్రు
పదరాజ కన్యక వేఁడన్। చారుతర పటములొ
సఁగవె। శ్రీరాజిత భూషణాంగ సీతారామా॥

పగవానితమ్ముఁడనుచును। పగయెంతయు లే
క కరుణ భాసిల లంకన్। దెగక విభీషణు మున్న।
ఖగవాహన కాచితివు రాఘవరామా॥ ౫౬॥

అసురులుసుధగోలి నిను గని। కసిఁదొలఁగిసు
ధాఘటంబు కరమునఁనిడ నీ। వసమాన సుధను
సురలకు। రసికతఁదనరంగనీవె రాఘవరామా॥

సుందరముగదశరథవర। నందనుఁ డన సంభ
వించినట సీతాలంగా। పొందుగననుజులఁగలసిపు
రందరనుత వెలసితివు రాఘవరామా॥ ౫౮॥

వాటముగాను సుబాహుని। తాటకను వధిం
చి గాధితనయుఁడు పొగడఁగా। మేటిగజన్నముగా

చితి। రాట దోలఁగి మునులు చెలఁగ రాఘవ
రామా॥౬౦॥

పూతనను బాలియుంచెడి। ఘాతుక మొదవం
గఁ జాలుగ రక్షమునొసఁగన్। చైతన్యము డిపికా
చితి। శ్రీ తామరసాక్ష వరద సీతారామా॥

శకటంబై యొకదనుజుఁడు। వికటంబుగఁ బైని
బడిన వేళ్ళాలకోర్కై। నికటముదనరఁగ పదమునఁ
బ్రికటంబుగఁ గూల్చితివె రాఘవరామా॥౬౨॥

వేలుపులవగలు మాన్పఁగ। గాలైనుడి గొనె
దుర్దైత్యగర్వంబెల్లం। దూలమెడఁబిసికి చంపవె।
లాలిత భవపాశనాశ రాఘవరామా॥౬౩॥

నేరుపు దనరఁగ మెల్లన। కోరికనినుబట్టి రో
ట గోపికగట్టన్। గారవముగఁ గైకొనవే। శ్రీరా
జిత కీర్తిధామ సీతారామా॥౬౪॥

అసమానంబుగఁ గంసుని। కసిదనరిన దనుజ
తతిని ఖండించి వెస్క। పసమీఱఁగ నిజరుల
ను। రసికాగ్రణి మనిచినావు రాఘవరామా॥

మచ్ఛమవై సోమకుము। న్వచ్ఛంబుగ ద్రుం
చివైచి యమరగణంబుల్। మెచ్చం దెచ్చితి శ్రు
తులను। లచ్చిగలిగి సురలువెలయ రాఘవరామా॥

మందర మంబుధిఁ గ్రుంగిన। నందుకు సుర

లెల్లవెలవ నయ్యెద్రికినీ। వందనముగఁ గూర్మ్మ
గుచు పు। రందరనుతకుదురుగా వెరాఘవరామా॥

దానవుఁడు భూమిఁగొనిచనఁ। బూనినపగమీ
ర లోకపుంజము గలఁగన్। వానిని కిటివై దుం
చితి। శ్రీనారదవినుతనామ సీతారామా॥౬౮॥

పాపపు హిరణ్యకశిపుఁడు। కోపముగొని ప
ట్టిఁ బట్టికొని దండింపన్। రూపణఁచితి నరహ
రివై। ప్రాపుగఁ బ్రహ్లాదుఁ బ్రోవ రాఘవ
రామా॥౬౯॥

ఖేదము సురలకుఁ దీరత్రి। పాదావని వేఁ
డి బలిని ఫణిలోకమునన్। బాదుకొననిడిన వా
మన। శ్రీదశరథరాజ పుత్రి సీతారామా॥౭౦॥

శ్రీపరశురాముఁడనఁగను। భూపతులను సం
హారించి భువి కశ్యపునిన్। బ్రాపింపఁజేసి తఖ
లము। ప్రాపగుచు సురారిభీమ రాఘవరామా॥

దశరథ రాముఁడ వగుచును। దశకంధరుధ
రణిఁగూల్చి ధరణిజ సీతన్। దశదళు కొత్తఁగఁ
దెచ్చితి। రసికజనుల్ సంతసింప రాఘవరామా॥

ఖలుల హరించు తలంపున। బలరామాభిఖ్యఁ
దనరీ పార్థివులలరన్। చలముగ దనుజులఁ బలు
వుర। లలితంబుగఁ దుంచితీవు రాఘవరామా॥

బుద్ధతను వెత్తి దైత్యుల। నిద్ధరఁబడఁద్రుంచి వైచి హిత వలరారన్। సిద్ధముగ మునుల దివిజుల। రద్దుదొలఁగఁబ్రోచితీవు రాఘవరామా॥

కలికివయి కలియుగంబున। వలనొప్పఁగదానవులను వధియించి వెసన్। గలితముగ యశము నొందవె। లలిత రమా హృదయలోల రాఘవ రామా॥ ౭౫॥

శ్రీమత్స్య కూర్మనాథా। శ్రీమద్వరహావతార శ్రీనరసింహా। వామనరామా రామా। రామా శ్రీబౌద్ధ కలికి రాఘవరామా॥ ౭౬॥

కరుణాపయోధి వంచును, కరిఁగాఁచితివంచు మిగుల ఘనుఁడవటంచున్। వెరవున నిను జేరితి దు। ర్భర భవ బంధములఁ బాపు రాఘవ రామా॥ ౭౭॥

నీ దాస్యంబొన గూరిచి। సాదరముగఁ జేరఁదీసి సంపదలను నా। కాదరణఁ గలుగఁ జేయఁగ। రాదా రణరంగభీమ రాఘవరామా॥ ౭౮॥

భాగవతజనుల సేవకు। రాగము పుట్టించు మెపుడు రాజితలీలన్। భోగములు గోరఁ జేయక। శ్రీగజవరవినుత హేమ సీతారామా॥ ౭౯॥

రామానుజ దేశికులకు। నేమంబున భక్తి స

ఫణిశయను నెవ్విధంబునఁ । బ్రణుతింపనధ
వభయంబు వాయు నటంచున్ । వినుతించితి స
తరవి జన । మణులారా ప్రాజ్ఞులార మాటికి
మిమ్మున్ ॥౯౪॥

చారు కవీంద్రుల వినయం । బారఁగఁ బ్రార్థ
న యొనర్తుఁ బహువిధముల నీ । శ్రీరామ శతక
మందున । తీరుగ నెరసులు హరింపదిద్దుఁడి కరుణన్ ॥

సూరిమి లేని భార్యయును కోమల మించుక
లేని మాటయున్ । సారము లేని వంటకము స
న్మతి లేని సహోదరుండు నా । చాగము లేని
సద్వ్రతము సౌఖ్యమొనర్పఁగ లేని పుత్రుఁడున్ ।
ధారుణిలో వృథా యభవధర్మ విదారణ ధ
ర్మరక్షణా ॥౯౬॥

హితవరి గాని భృత్యుఁడును నిష్ఫము దప్పి
నవాని బ్రాఁప స । తుష్టతుకము లేని మానసము
కోరిన దీయఁగ లేని హస్తమున్ । చతురత లేని
హాస్యముఁ సంతతి నొందఁగ లేని జన్మమున్ । స
తము నిరర్థకంబగు రసాకరబంధన దైత్యనాశనా ॥